# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 2 | జూన్ 1992 | సంచిక 35


## విషయసూచిక


వ్యక్తి స్వాతంత్ర్యం – రాచమల్లు రామచంద్రారెడ్డి

మాట – మౌనం – డా. సంజీవదేవ్

తాపీ ధర్మారావుతో మధురవాణి – పురాణం సుబ్రహ్మణ్య శర్మ

అసతోమా సద్గమయ – రాంభట్ల

రస వివేచన – చీమకుర్తి శేషగిరిరావు


ముఖచిత్రం
సిద్ధార్థ రాగోదయము
చిత్రకారుడు: దామెర్ల రామారావు

★ ★ ★

రెండు, మూడు కవర్ పేజీలలో
మైకెలాంజిలో ఆధ్యాత్మిక చిత్రణ


Printed, Published and Edited by Shri ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Carnivorous,** *adj.* Addicted to the cruelty of devouring the timorous vegetarian, his heirs and assings.

**Cartesian,** *adj.* Relating to Descartes, a famous philosopher, author of the celebrated dictum, *Cogito ergo sum*-whereby he was pleased to suppose he demonstrated the reality of human existence. The dictum might be improved, however, thus: *Cogito cogito ergo cogito sum*-"I think that I think, therefore I think that I am;" as close an approach to certainty as any philosopher has yet made.

**Cat,** *n.* A soft, indestructible automaton provided by nature to be kicked when things go wrong in the domestic circle.

This is a dog, This is a cat, This is a frog, This is a rat,

Run, dog, mew, cat, Jump, frog, gnaw, rat. *Elevenson.*

**Caviler,** *n.* A critic of our own work.

**Cemetery,** *n.* An isolated suburban spot where mourners match lies, poets write at a target and stone-cutters spell for a wager. The inscriptions following will serve to illustrate the success attained in these Olympian games:

His virtues were so conspicuous that his enemies, unable to overlook them, denied them, and his friends, to whose loose lives they were a rebuke, represented them as vices. They are here commemorated by his family, who shared them.

In the earth we here prepare a Place to lay our little Clara.
- *Thomas M. and Mary Frazer.*
P.S.-Gabriel will raise her.

**Centaur,** *n.* One of a race of persons who lived before the division of labor had been carried to such a pitch of differentation, and who followed the primitive economic maxim, "Every man his own horse." The best of the lot was Chiron, who to the wisdom and virtues of the horse added the fleetness of man. The scripture story of the head of John the Baptist on a charger shows that pagan myths have somewhat sophisticated sacred history.

**Cerberus,** *n.* The watch-dog of Hades, whose duty it was to guard the entrance - against whom or what does not clearly appear; everybody, sooner or later, had to go there, and nobody wanted to carry off the entrance. Cerberus is know to have had three heads, and some of the poets have credited him with as many as a hundred. Professor Graybill, whose clerky erudition and profound knowledge of Greek give his opinion great weight, has averaged all the estimates, and makes the number twenty-seven - a judgment that would be entirely conclusive if Professor Graybill had known (a) something about dogs, and (b) something about arithmetic.

**Childhood,** *n.* The period of human life intermediate between the idiocy of infancy and the folly of youth-two removes from the sin of manhood and three from the remorse of age.

**Christian,** *n.* One who believes that the New Testament is a divinely inspired book admirably suited to the spiritual needs of his neighbor. One who follows the teachings of Christ in so far as they are not inconsistent with a life of sin.

# వ్యక్తి స్వాతంత్ర్యం సమాజ శ్రేయస్సు

రాచమల్లు
రామచంద్రారెడ్డి

ఒక వ్యక్తి ఏమి చేసినా ఇతరుల కెవ్వరికీ యేమీ బాధలేకపోతే వ్యక్తి స్వాతంత్ర్య సమస్యే లేదు. వ్యక్తి స్వార్థం కొన్ని సమయాల్లో సమాజ శ్రేయస్సుకుగాని, కొందరు యితర వ్యక్తుల వ్యక్తిగత శ్రేయస్సుకుగాని వ్యతిరేకంగా వుండడం వల్లనే వ్యక్తికి యెంతవరకు స్వాతంత్ర్యం యివ్వవచ్చు అనే ప్రశ్న ఉత్పన్నమైంది. వ్యక్తికి బొత్తిగా స్వాతంత్ర్యం లేకపోతే సమాజ శ్రేయస్సే దెబ్బతింటుంది కాబట్టి, సమాజ శ్రేయస్సు కొరకే వ్యక్తికి వీలున్నంత స్వాతంత్ర్యం యివ్వడం అవసరం. అందువలన ఎంత స్వాతంత్ర్యం యివ్వడం అవసరం – అనేది కూడా యీ సమస్యలో ఒక భాగమే.

ఈ రూపంలో సమస్య కేవలం సాంఘిక సమస్యగానే కనపడుతుంది. కాని, వ్యక్తి స్వాతంత్ర్యానికి పరిమితు లేర్పరచేది సమాజ శ్రేయస్సుకై సమాజం తరపున సమాజ ప్రతినిధిగా వ్యవహరిస్తున్నానని చెప్పే ప్రభుత్వమే కాబట్టి, యీ సమస్య రాజకీయ సమస్యగా పరిణమించింది.

**స్వాతంత్ర్యం అంటే** – ''అవసరాన్ని గూర్చిన చైతన్యమే స్వాతంత్ర్యం'' లేక ''అవసరాన్ని గుర్తించడమే స్వాతంత్ర్యం'' (Freedom is the appreciation of necessity), అనేది ఒక ప్రసిద్ధమైన మార్క్సిస్టు సూత్రం. దీనిద్వారా వ్యక్తి అవసరాలనుబట్టి స్వాతంత్ర్యం వుంటుందని గానీ, వుండాలని గానీ అర్థాలు లాగడం మార్క్సిజాన్ని అపహాస్యం పాలు చేయడమే. ఏ సమాజంలో అయినా ప్రభుత్వాలు వ్యక్తులకు యిచ్చే స్వాతంత్ర్యానికిగానీ, వ్యక్తులు కావాలని పోరాడే స్వాతంత్ర్యానికిగానీ ఈ నిర్వచనంతో యేమీ సంబంధం లేదు. ఈ నిర్వచనం సహాయంతో వ్యక్తి స్వాతంత్ర్య సమస్యను పరిష్కరింప పూనుకున్న మార్క్సిస్టు మిత్రులు పిడివాదంలోకి దిగి తమకే అర్థంకాని అయోమయంలో పడిపోతుంటారు.

''అవసరాన్ని గుర్తించడమే స్వాతంత్ర్యం'' అంటే యేమిటి? ఒకనికి ఆకలి అయినప్పుడు అన్నం అవసరం. ఆ అవసరాన్ని గుర్తించడమేనా స్వాతంత్ర్యం అంటే? అన్నం దొరికితే, ఆకలి బాధనుండి వాడు విముక్తుడైతే అప్పుడు వానికి ఆకలినుండి స్వాతంత్ర్యం లభించిందన వచ్చు. అన్నం కొరకు ప్రయత్నమైనా చేయకుండా అన్నం యొక్క అవసరాన్ని గుర్తించినంత మాత్రాన వాడు స్వతంత్రుడెట్లా ఔతాడు?

ఇంత మాత్రమే అయితే ఈ అయోమయాన్ని ప్రస్తావించడమే అనవసరం – పరిహసించి దాటిపోవచ్చు. ఈ నిర్వచనానికి కొంత కుతర్కం జోడించి, రష్యాలో వ్యక్తి స్వాతంత్ర్యం మీద వుండే ప్రతి నిర్బంధాన్నీ సమర్థించే మిత్రులూ వున్నారు. సోవియట్ సమాజ శ్రేయస్సు

కొరకు వ్యక్తులు కొన్ని పనులు చేయకూడదనీ, అంటే కొన్ని పనులు చేయకుండా వుండడం అవసరమనీ, ఆ అవసరాన్ని గుర్తించడమే స్వాతంత్ర్యం అనీ వాళ్ళ వాదం. ఆ పనులు సమాజ శ్రేయస్సుకు భంగకరమైతే, అవి చేయకుండా వుండవలసిన అవసరాన్ని గుర్తించిన వ్యక్తి ఐచ్ఛికంగా తన స్వాతంత్ర్యానికి పరిమితు లేర్పరచుకోవచ్చు. ఈ విధంగా కోర్కెలన్ను అణచుకోవడమేనా స్వాతంత్ర్యం అంటే? కోర్కెలను అణచుకోవడమే స్వాతంత్ర్యం అయితే, లక్షణంగా మన మందరమూ బౌద్ధమతంలో చేరవచ్చు. మహానుభావుడు గౌతమబుద్ధుడు 2500 ఏండ్లనాడే అన్నాడు – కోర్కెలను అణచుకోవడమే స్వాతంత్ర్యం అని, కాదు – కోర్కెలను అణచుకోవడమే ముక్తి అని. ముక్తికంటే స్వాతంత్ర్యం గొప్పది కాదు కదా!

అసలు రష్యాలో వున్న సమస్య యొక్క స్వరూపం యిది కూడా కాదు. కొన్ని పనులు యెవరూ చేయకూడదని ప్రభుత్వం ఆజ్ఞాపిస్తుంది. వ్యక్తి ఆ నిషేధించిన పనులు చేస్తే ప్రభుత్వం శిక్షిస్తుంది. శిక్షాభయంవల్ల వ్యక్తి ఆ పనులు చేయదు. ప్రభుత్వం శిక్షిస్తుంది కాబట్టి ఆ పనులు చేయకుండా వుండడం వ్యక్తియొక్క అవసరం. ఆ అవసరాన్ని గుర్తించడమేనా స్వాతంత్ర్యం అంటే? శిక్షాభయం వల్ల ప్రభుత్వ ఆజ్ఞలకు లోబడడం స్వాతంత్ర్యం అనిపించుకుంటుందా? అందరూ కాంగ్రెస్‌కే ఓటుచేసి తీరాలని మన ప్రభుత్వం ఆజ్ఞాపిస్తే, ఆ ఆజ్ఞకు కట్టుబడి కాంగ్రెస్‌కు ఓటుచేసిన వారందరూ స్వతంత్రంగా బ్రతుకుతున్నారని అర్థమా? బానిస సమాజంలో విధేయులైన బానిసలందరూ సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవిస్తున్నారని అనవచ్చునా? ఏమిటీ దుష్పాండిత్యం!

మరి ''అవసరాన్ని గుర్తించడమే స్వాతంత్ర్యం'' అనే సూత్రానికి అర్థం యేమిటి?

ఏంగిల్సు యీ నిర్వచనం యిచ్చినప్పుడు, ప్రజల మీద ప్రభుత్వాలు బుద్ధి పూర్వకంగా విధించే నిర్బంధాలను ఆయన ఉద్దేశించనేలేదు. ఎవరి అవసరాలను బట్టి వాళ్లు స్వాతంత్ర్యం అనుభవిస్తారని కానీ, అనుభవించవలెనని కానీ ఆయన ఊహలోనే లేదు. సమాజంలో వ్యక్తి యొక్క స్వాతంత్ర్యం అంటే యేమిటి అన్న ప్రశ్నకు కాదు ఆ సమాధానం. మానవుడు ప్రకృతికి యెంతవరకు లోబడినాడు, యెంతవరకు స్వతంత్రుడు – అనే ప్రశ్నకు జవాబిస్తూ ''అవసరాన్ని గుర్తించడమే స్వాతంత్ర్యం'' అని ఏంగిల్సు అన్నాడు. మానవ సమాజం కూడా ప్రకృతిలోఒక భాగమే కాబట్టి, మానవుడు సమాజానికి ఎంతవరకు దాసుడు, ఎంతవరకు స్వతంత్రుడు – అనే ప్రశ్నకు కూడా యీ నిర్వచనమే సమాధానం. కాని యిక్కడ మానవుడు అంటే వ్యక్తి అని కాదు – మానవ జాతి అంతా.

పై ప్రశ్న యొక్క సంపూర్ణ స్వరూపం ఏమిటంటే:

మానవునికి స్వాతంత్ర్యం అనేది అసలు వుందా? నిద్ర, ఆకలి మొదలైన దేహ ధర్మాలకు మానవుడెప్పుడూ దాసుడే కదా! గాలి, వాన, యెండ, భూమి, సూర్యుడు, గ్రహ నక్షత్రాలు, పశుపక్షులు, వృక్షజాతులు, సమస్త ప్రకృతిలోని, సమస్త విశ్వంలోని సమస్త వస్తువులూ, సమస్త శక్తులూ వాటి వాటి సహజ ధర్మాలను అనుసరించి వాటి వాటి అంతర్గత నియమాలను అనుసరించి ప్రవర్తిస్తున్నాయి కదా? అందులో ఏ ధర్మాన్నీ, ఏ నియమాన్నీ ఉల్లంఘించే శక్తి మానవునికి లేనప్పుడు, మానవునికి స్వాతంత్ర్యం యెక్కడుంది? భూమి యొక్క ఆకర్షణ శక్తిని మానవుడు మార్చలేడు కదా! అగ్ని యొక్క జ్వలన ధర్మాన్ని మానవుడు ఉల్లంఘించ లేడు కదా! ప్రకృతి నియమాలకు లోబడి మానవుడు తన కోర్కెలు తీర్చుకోవలసిందే కాని,

మిసిమి, జూన్ 1992

ప్రకృతి నియమాలకు వ్యతిరేకంగా కాదు గదా? (ప్రకృతి నియమాలు అన్నప్పుడు మానవ సమాజాన్నీ, మానవుడి దేహాన్నీ, మనస్సునూ పాలించే నియమాలన్నీ అందులో భాగమే) ప్రతి విషయంలోనూ మానవుడు ప్రకృతికి లోబడే బ్రతకవలసి వచ్చినప్పుడు మానవునికి బానిసత్వం తప్ప స్వాతంత్ర్యం యెక్కడుంది?

ఈ ప్రశ్నకు సమాధానంగా ఏంగిల్సు "Freedom is the appreciation of necessity" అన్నాడు. ఇక్కడ necessity అనే పదానికి న్యాయంగా అర్థం "అవసరం" అని కాదు. - "ఆవశ్యకత" అని. తెలుగు భాషలో సంస్కృత నాటకాలు వికృత రూపం దాల్చినా, యింగ్లీషు నవలలు చిత్రహింస చేయబడినా, ఉపేక్షించిన తెలుగుజాతిని ఏంగిల్సు నిర్వచనం (తెలుగులో) పెనుభూతమై పీడిస్తున్నది.

చెట్టుమీద నుండి రాలిన పండు విధిగా, తప్పనిసరిగా భూమిమీద పడుతుంది – అవశ్యం భూమిమీద పడుతుంది. ఆవశ్యం అంటే పడడం పడకపోవడం దానవశంలో లేదని. పండుకు భూమిమీద పడే ఆవశ్యకత వుంది. మంటలో పడిన కాగితానికి బూడిద అయ్యే అవశ్యకత వుంది. ఆవశ్యకతలే ప్రకృతి నియమాలు (laws of nature). ఈ ఆవశ్యకతలకు మానవుడు దాసుడా అన్న ప్రశ్నకు "ఆవశ్యకతను గుర్తించడమే స్వాతంత్ర్యం" అని సమాధానం.

**ఈ నిర్వచనానికి అర్థం ఏమిటంటే:** జంతువులన్నీ ప్రకృతికి బానిసలుగానే బ్రతుకుతున్నాయి. జంతు దశలో మానవుడూ అంతే. జంతు దశలోవున్న ఆదిమ మానవుడు క్రమంగా ప్రకృతిని గమనిస్తూ, ప్రకృతితో ఘర్షణపడుతూ ప్రకృతి నియమాలను తెలుసుకున్నాడు. వ్యవసాయం తెలియక పూర్వం మానవుడు ప్రకృతిలో దొరికిన వస్తువులను దొరికినప్పుడు మాత్రమే తినగలిగే వాడు. ఏ పంటలకు ఏయే శీతోష్ణస్థితులు అవసరమైనదీ, పంటలకూ ఋతువులకూ గల సంబంధాలూ, పంటలకు భూసారంతోనూ వర్షపాతంతోనూ గల సంబంధాలూ – యివన్నీ క్రమంగా తెలుసుకొన్న మానవుడు తాను కోరిన పంటను కోరినంతా పండించుకొని కోరినప్పుడు తినగలిగే సౌకర్యం కలిగించుకున్నాడు. ప్రకృతి నియమాలను ఉల్లంఘించడం ద్వారా గాక ఆ నియమాలను గుర్తించడంవల్ల మానవుడు ఆమేరకు స్వతంత్రుడైనాడు.

వ్యాధులు ఏ పరిస్థితులలో, ఏ కారణాలవల్ల కలిగేదీ తెలుసుకొన్న మానవుడు వ్యాధుల నుండి విముక్తుడు కాగలడు. మానవుడు ఆ మేరకు ప్రకృతి నుండి స్వతంత్రుడు.

ఏ పరిస్థితులలో, ఏ కారణాలవల్ల వర్షం వచ్చేదీ తెలుసుకున్నప్పుడు మానవుడు తాను కోరినప్పుడు కోరిన చోట కోరినంత వర్షం కురిపించుకోగలడు. ఆ మేరకు మానవుడు ప్రకృతినుండి స్వతంత్రుడు.

సంతానోత్పత్తికి సంబంధించిన ప్రకృతి నియమాలు తెలుసుకున్న మానవుడు తన సంతానం విషయంలో దేవుని మీద భారం వేసి ఊరుకోడు. పురుష స్పర్శ లేకుండా మాతృత్వం పొందిన స్త్రీలు ఇంగ్లాండులో కొన్ని వేల మంది వుండడమూ, చైనా జనాభాను తగ్గించడానికి చైనా – ప్రభుత్వం ప్రయత్నించడమూ వివేకవంతులైన స్త్రీ పురుషులందరూ తమ కుటుంబ పరిమితులు తామే నిర్ణయించు కోవడమూ – ఆ మేరకు మానవుడు సాధించిన స్వాతంత్ర్యం యొక్క నిదర్శనాలు.

పెట్టుబడిదారి యుగంలో మానవుడు ఆర్థిక నియమాలకు బానిస. ఆర్థిక మాంద్యమూ, డబ్బు విలువ పెరగడమూ, తరగడమూ, వస్తువుల ధరలు అటు ఉత్పత్తిదారుల ఆధీనంలో ఇటు వినియోగదారుల ఆధీనంలో కాని లేకుండా మార్కెట్ అనే బాహ్యశక్తికి లోబడి వుండడమూ – ఇవన్నీ ఆర్థిక రంగంలో మానవుని పారతంత్ర్యానికి లక్షణాలు. అర్థశాస్త్ర రహస్యాలు తెలిసిన మానవుడు, అంటే అర్థశాస్త్ర నియమాలు గుర్తించిన మానవుడు, ఆ నియమాలను తన కోరికలకు అనుగుణంగా వాడుకున్నప్పుడు ఆర్థికంగా స్వతంత్రుడౌతాడు. అదే సోషలిస్టు ఆర్థిక విధానం. ఒకవైపు ఆహార ధాన్యాల కొరత, మరొకవైపు వ్యవసాయ యోగ్యమైన బంజర్లు, ఇంకొక వైపున నిరుద్యోగులు – యిది ఈనాటి ఇండియాలోని ఆర్థిక విధానం యొక్క మూల స్వరూపం. నిరుద్యోగులు బంజర్లు సాగుచేస్తే ఆహార సమృద్ధి కలుగుతుంది. కాని ఈ పని సాధ్యం కాక పోవడానికి ఆర్థిక నియమాలే కారణం. అంటే ఇండియాలో మానవుడు ఆర్థికంగా అస్వతంత్రుడు అని అర్థం.

ఈ విధంగా ప్రకృతి నుండి స్వాతంత్ర్యం అంటే ప్రకృతి నియమాలను ఉల్లంఘించడం కాదు. ప్రకృతి నియమాలను గుర్తించి గుడ్డిగా వాటికి లోబడడమూ కాదు. వాటిని గుర్తించి స్వప్రయోజనాలకు వాడుకోవడం. మనం కోరిన ఫలితానికి ఏ కార్యం చేయవలెనో తెలుసుకొని, ఆ కార్యం చేసి, ఆ ఫలితాన్ని పొందవచ్చు. ప్రకృతి నియమాలను గుర్తించడమే స్వాతంత్ర్యానికి మూలం. ''ఆవశ్యకతను గుర్తించడమే స్వాతంత్ర్యం.''

''ఆవశ్యకతను గుర్తించడమే స్వాతంత్ర్యం'' అనడంకంటే ''ప్రకృతి నియమాలను గుర్తించడమే స్వాతంత్ర్యం'' అని కానీ, ''విజ్ఞానమే స్వాతంత్ర్యం'' అని కానీ అంటే (మన భాషలో) మరింత స్పష్టంగా వుంటుంది.

**స్వాతంత్ర్యం – చారిత్రక పరిణామం:** ఈ సూత్రం మానవుడు ప్రకృతి నుండి పొందే స్వాతంత్ర్యానికి వర్తించినట్లే మానవుని ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్వాతంత్ర్యానికి కూడా వర్తిస్తుంది. మానవ చరిత్రకు అర్థం చెప్పే ప్రయత్నంలోనే మొదట హెగెల్ అనే తత్త్వవేత్త ఈ సూత్రాన్ని ప్రతిపాదించాడు. గతితర్కసూత్రాలను మార్క్సు హెగెల్ నుండి గ్రహించినట్లే, ఏంగిల్సు ఈ సూత్రాన్ని హెగెల్ నుండి కొద్ది మార్పుతో స్వీకరించాడు. ''ఆవశ్యకతను అర్థం చేసుకోనంత వరకే పారతంత్ర్యం'' (Necessity is blind in so far as it is not understood) అని హెగెల్ నిర్వచనం. ఇక్కడ ''ఆవశ్యకత'' అనే పదానికి ప్రకృతి నియమం అనే అర్థం కాక, భారతీయ పరిభాషలో ''విధి'' లేక ''దైవ నిర్ణయం'' అనే అర్థం అవుతుంది. ఏంగిల్సు వాడినది ప్రకృతి నియమం అనే అర్థంలోనే.

హెగెల్ ఏ ప్రశ్నకు సమాధానం చెప్పాడో ఆ ప్రశ్నలోనే ఉంది ఆ భేదం. సృష్టికంతటికీ భావం (భావాత్మకమైన భగవత్ శక్తి అనవచ్చు) ఆది కారణమనీ, నిత్యం పరిణమిస్తూ వుండడం ఆ భావంయొక్క స్వభావమనీ ఆ పరిణామం కొన్ని నియమాలను అనుసరించి జరుగుతున్నదనీ, సృష్టి అంతా భావం యొక్క అవతారమే (Manifestation) అనీ, సృష్టిలో జరిగే పరిణామమంతా భావపరిణామం యొక్క ఫలితమే అనీ, మానవుడు సృష్టిలో ఒక భాగమే కాబట్టి మానవ చరిత్ర అంతా భావ పరిణామ క్రమంలో ఒక భాగమే అనీ హెగెల్ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం నుండి ఒక ప్రశ్న బయలుదేరింది. నియమబద్ధమైన భావపరిణామం యొక్క ఫలితమే మానవ చరిత్ర ఐనప్పుడు మానవ చరిత్ర మానవులు నిర్మించినది కాదు

గదా? మానవుని జీవితం మానవుని ఆధీనంలో లేదు కదా? మానవుడు చేసే ప్రతి పనీ ప్రతి ఆలోచనా పై నియమాల ప్రకారం జరిగి తీరవలసిందే కదా? మానవుని సర్వ కార్యాలూ, ఆలోచనలూ, సంకల్ప వికల్పాలు జరగవలసిన ఆవశ్యకత వుండి జరుగుతూ వుంటే, ఇక మానవుని స్వాతంత్ర్యం యెక్కడుంది? మానవుడు యీ ఆవశ్యకతకు బానిసే కదా? ఈ ప్రశ్నకు సమాధానంగా 'ఆవశ్యకతను అర్థం చేసుకోనంత వరకే మానవునికి పారతంత్ర్యం' అని హెగెల్ అన్నాడు.

ఏంగిల్సుకు యెదురైన ప్రశ్నలో మానవుడు వేరు ప్రకృతి వేరు. ప్రకృతికీ మానవునికీ జరిగే ఘర్షణలో మానవుడు స్వతంత్రుడా? అని ఆ ప్రశ్న. మానవుని సమాజమూ, దేహమూ, మనస్సూ ప్రకృతిలో భాగమే అనుకున్నప్పుడు కూడా మానవుడు తన భిన్నత్వాన్ని కోల్పోలేదు.

హెగెల్‌కు యెదురైన ప్రశ్నలో మానవుడూ ప్రకృతీ వేరు వేరు కాదు. మానవుడు ప్రకృతిలో, సృష్టిలో ఒక అచేతన భాగం అనే నిర్ధారణ హెగెల్ సిద్ధాంత ప్రాతిపదికలోనే వుంది.

''ఆవశ్యకతను అర్థం చేసుకోనంత వరకే పారతంత్ర్యం'' అన్న హెగెల్ సూత్రానికి ఆవశ్యకతను (విధిని) అర్థం చేసుకోవడమే వివేకం (Reason) అనీ, అట్టి వివేకం కలవారు నియమాలను, అంటే ప్రకృతి నియమాలనూ, ఆర్థిక సాంఘిక రాజకీయాది సర్వనియమాలనూ ప్రతిఘటించకుండా అనుసరిస్తారనీ, ఆ వివేకమే మానవ చరిత్రను నడిపిస్తున్నదనీ అర్థం. ఒకనాడు ఒక దేశంలో ఒక ప్రభుత్వం వుందంటే, ఆ ప్రభుత్వం (భావ పరిణామ నియమాలను బట్టి) చరిత్ర పరిణామక్రమంలో ఒక ఆవశ్యక భాగం అనీ, ఆ ప్రభుత్వాన్ని ప్రతిఘటించకుండా అనుసరించడం వివేకమనీ, అదే న్యాయమనీ హెగెల్ సూత్రానికి ఇవ్వబడిన రాజకీయ వ్యాఖ్యానం. ఈ వ్యాఖ్యానం యొక్క సూత్రీకరణే ''జరుగుతున్నదంతా న్యాయం'' (Whatever it is right) అన్న వాక్యం హెగెల్ సూత్రం నుండి క్రమంగా వివేకమంటే నియమాలను గుర్తించి ఐచ్ఛికంగా అనుసరించడమే అనీ, వివేకమంటే ఐచ్ఛిక బానిసత్వమే అనీ, ఐచ్ఛిక బానిసత్వమే స్వాతంత్ర్యం అనీ అర్థాలు స్పష్టంగా వస్తాయి. మానవునికీ ప్రకృతికీ వున్న భిన్నత్వాన్నీ, ఘర్షణనూ హెగెల్ గుర్తించనందువల్ల స్వాతంత్ర్యానికి ఈ దుర్గతి పట్టింది. (హెగెల్ రాజకీయంగా ఆనాటి అభివృద్ధి నిరోధకుడు, ప్రత్యక్షంగా ప్రభుత్వ పక్షపాతి)

జంతువులు ప్రకృతిలో ఒక భాగం – అచేతన భాగం. అవి ప్రకృతికి బానిసలు. చిలక చదువూ, కుక్కల విశ్వాసం, ఎలుగుబంటి నృత్యమూ వివేకవంతమైనవీ విచక్షణాత్మకమైనవీ కావు – కెమెరా ఫోటో యెత్తినట్లు, మిషన్ మనతూకాన్ని అట్టముక్కమీద అచ్చుగుద్ది ఇచ్చినట్లు యాంత్రికంగా జరిగే పరిణామాలు. ఆదిమ మానవుడు ప్రకృతి కంటే తాను భిన్నుడని గుర్తించినప్పుడే, ప్రకృతిని బాహ్య ప్రకృతిగా భావించినప్పుడే, మానవునిలో ప్రకృతిని గూర్చిన చైతన్యం (Consciousness) ప్రారంభమౌతుంది. అప్పుడే ప్రకృతికీ, మానవునికీ ఘర్షణ ప్రారంభమౌతుంది. ఘర్షణ అంటే దొరికిన దానిని యాంత్రికంగా గ్రహించడం కాక, తన కోర్కెలను తీర్చుకోడానికి చేసే ప్రయత్నంలో ప్రకృతిలో యెదురైన ప్రాతికూల్యాన్ని యెదుర్కోవడం. అంటే, ఉన్న ప్రకృతిని ఉన్నట్లుగా ఉపయోగించు

కావడం కాక, ప్రకృతిని తనకు అనుకూలంగా మార్చుకోడానికి ప్రయత్నించడం. ఆ ఘర్షణ ఫలితంగా మానవుడు క్రమక్రమంగా ప్రకృతిని ఏవో కొన్ని నియమాలు నడిపిస్తున్నాయని తెలుసుకుంటాడు. ఆ నియమాల ప్రకారం ఒక ఫలితం కొరకు ఒక కార్యం చేయవలసి వుంటుందని గుర్తించి ఆ కార్యం చేసి ఆ ఫలితం పొందడానికి ప్రయత్నిస్తాడు. ఆ గుర్తింపు సరియైనది కాకపోవచ్చు. సంపూర్ణం కాక పోవచ్చు. సరియైనది కాదని ఆచరణలో (ఫలితాన్ని బట్టి) తేలినప్పుడు మానవుని ఆ గుర్తింపులో, ప్రకృతిని గూర్చిన అవగాహనలో, ప్రకృతిని గురించి మానవుడు చేసుకున్న సిద్ధాంతంలో మార్పు వస్తుంది. సిద్ధాంతమూ, ఆచరణా పరస్పర ఆధారాలు.

ఆదిమ మానవుడు వర్షం కొరకు బొ్మ్రాతికి నీళ్ళు పోయడమూ, పంటలు బాగా పండడం కొరకు పొలాలకు జంతువులను బలి యివ్వడమూ పరిహసింపదగిన అజ్ఞానమే అయినా, వర్షమూ మంచి పంటలూ కోరిన మానవుడు చేతులు ముడుచుకొని కూర్చోకుండా, ప్రకృతిని గురించి తనకున్న అవగాహన యొక్క అల్ప పరిధులను బట్టి ప్రకృతిని తనకు అనుకూలంగా మార్చుకోడానికి ఏవో కొన్ని ప్రయత్నాలు చేయడం గమనించదగినది. పురుషకారం (Conscious effort) అంటే అట్టి ప్రయత్నమే. బొమ్రాతికి నీళ్ళు పోయడం మత సంబంధమైన ఆచారం (ritual) కాదు. ఏ దేవుని మీదా భక్తితో కాదు. దానికీ – వర్షం రావడానికీ ఏదో యాంత్రికమైన (Mechanical), ప్రాకృతికమైన (natural) కార్యకారణ సంబంధం వుందని అనుకోవడం వల్లనే. అది ఆదిమ మానవుని విజ్ఞానం, సైన్సు (ఆదిమ మానవుడు సంపూర్ణంగా భౌతికవాది. వర్గ విభజన ద్వారా ఆచరణకు దూరమైన మేధావివర్గం ఏర్పడిన తర్వాతనే భావవాదం పుట్టింది).

ఈ విధమైన ఘర్షణలో – ప్రకృతిని తనకు అనుకూలంగా మార్చడానికి మానవుడు చేసే ప్రయత్నంలో – మానవుడు మారుతాడు. అంటే, ప్రకృతిని గురించి మానవునికున్న అవగాహనలో మార్పు వస్తుంది. జ్ఞానం అభివృద్ధి అవుతుంది, మేధస్సు వికసిస్తుంది. మానవుని అనుభూతులలో, అభిరుచులలో మార్పు వస్తుంది. మానవుని చైతన్యం పెరుగుతుంది. ఈ విధంగా ప్రకృతి నియమాలను గురించిన పరిజ్ఞానం వృద్ధి అయ్యే కొద్దీ, ఆ మేరకు మానవుడు స్వతంత్రుడౌతూ వుంటాడు.

**ఇచ్ఛా స్వాతంత్ర్యం:** మానవుడు కార్యరంగంలో స్వాతంత్ర్యం పొందే పరిణామం మాత్రమే ఇంతవరకు వివరించబడింది. మానవుని మేధారంగం మాట యేమిటి? మానవుడు తన కోర్కెలు తీర్చుకోవడమే స్వాతంత్ర్యం ఐతే, ఇంతవరకు యిచ్చిన వివరణ పరిపూర్ణమౌతుంది. కాని మానవుని కోర్కెల నుండి మానవునికి స్వాతంత్ర్యం అనేది వుందా? మానవుని మనసులో కలిగే ప్రతి ఆలోచనకూ, ఊహకూ, కోర్కెకూ ఏదో కారణం లేక ఏవో కొన్ని కారణాలు వుండక తప్పదు. కార్యకారణ సూత్రం – అంటే ఏ కారణమూ లేకుండా ఏ కార్యమూ జరగదని – ఒప్పుకోక తప్పదు కనుక, కోర్కెలకు కూడా కారణాలు వుండక తప్పదని ఒప్పుకోవాలి. ఒకనికి ఒక సినిమా చూడాలని కోర్కె కలిగితే, ఆ సినిమాను గురించి అతడు యితరుల వలన విన్నదీ, అతడు చూసిన ప్రకటనలూ, ఆ సినిమాలోని నటీనటులు మొదలైనవి ఆ కోర్కెకు కారణంగా వుంటాయి. వాని అభిరుచులూ, వాని సంస్కారమూ కూడ వాని కోర్కెను నిర్ణయిస్తాయి. అంటే వాని గత చరిత్ర అంతా వాని కోర్కెకు

కారణమనవచ్చు. వాని తల్లిదండ్రుల నుండి వానికి సంక్రమించిన స్వభావమూ కారణమే కావచ్చు. అంటే మానవజాతి గత చరిత్ర అంతా కారణమే అనవచ్చు. ఏమైనా, ఏ కారణమూ లేకుండా వానికి కోర్కె కలగలేదనేది నిర్వివాదం. మానవుని ప్రతి కోర్కె విషయం యింతే. ఐనప్పుడు మానవునికి స్వేచ్ఛ యెక్కడుంది? తన ఆధీనంలో లేని కారణాలవల్ల మానవునికి కోర్కెలు కల్గగా, ఆ కోర్కెలకు దాసుడై వాటిని తీర్చుకోడానికి మానవుడు ప్రయత్నిస్తు న్నాడు. మానవుని యిచ్ఛా మానవుని ఆధీనంలో లేదు కదా? మానవునికి యిచ్ఛా స్వాతంత్ర్యం లేదు కదా? ఈ ప్రశ్ననే ''ఇచ్ఛా స్వాతంత్ర్య సమస్య'' (Problem of Free will) అంటారు. ఈ ప్రశ్నకే హెగెల్ సమాధానం చెప్పబోయినది. చరిత్రలో మహా మహా మేధావులందరూ యీ ప్రశ్నతో కుస్తీలు పట్టి చేతులు జోడించిన వాళ్ళే.

చరిత్రలో యీ సమస్య ప్రధానంగా మత సమస్యగా ఎదురైంది. మానవుని చేష్టలు ఇచ్ఛను అనుసరించే వుంటాయి. కాబట్టి, మానవునికి ఇచ్ఛా స్వాతంత్ర్యం వుందంటే, మానవుని ఇచ్ఛనూ, చేష్టలనూ భగవంతుడు ముందే నిర్ణయించలేదనీ భగవంతునికి కూడా ముందు తెలుసుకునే అవకాశం లేదనీ అర్థం. అంటే భగవంతుని సర్వాధిపత్యానికీ, సర్వజ్ఞత్వానికీ భంగం కలుగుతుంది. మానవునికి ఇచ్ఛా స్వాతంత్ర్యం లేదంటే మానవుని చేష్టలకు పాప పుణ్యాలు అంటగట్టటం అన్యాయం. అప్పుడు నీతిశాస్త్రాలూ, స్వర్గ నరకాలూ మారిపో తాయి. భగవంతుడే తన సర్వాధిపత్యాన్ని తగ్గించుకొని మానవునికి ఇచ్ఛా స్వాతంత్ర్యం యిచ్చినాడంటే, మానవుడు స్వేచ్ఛగా బ్రతకడానికి అనుమతించినాడని అర్థం. స్వేచ్ఛగా బ్రతికిన మానవునికి పాపమనీ, పుణ్యమనీ వెంటబడడం – స్వేచ్ఛగా బ్రతకమని చెప్పి, స్వేచ్ఛగా బ్రతికినందుకు శిక్షించడం – భగవంతుడైన వాడు చేయకూడని పని. ఎటు తిప్పినా మావునికి పాప పుణ్యాలు అంటవు. ఈ రెండంచుల ఖడ్గాన్ని భగవంతుని మీదికే ప్రయోగించ డానికి పూనుకున్న తెలుగు వీరుడు 'కన్యాశుల్కం' నాటకంలోని గిరీశం 'ఓ దేవుడా' నీవు నన్ను స్వతంత్రునిగా సృష్టించినావా, అస్వతంత్రునిగా సృష్టించినావా?' అని ఆరంభిస్తాడు. ఈ విషమ సమస్యను పరిష్కరించడానికి చరిత్రలో మత మేధావులు సృష్టించిన కుతర్కం ఎన్ని టన్నులు వున్నదో ఆ భగవంతునికే యెరుక!

''మానవునికి ఇచ్ఛా స్వాతంత్ర్యం వుందని రుజువు చేయలేము కాని రుజువు చేయడం సాధ్యం కాదు గాని అది వున్నట్లే తోస్తుంది'' అని యీనాటి బూర్జువా మేధావులు, లాక్షణిక తార్కికులు మామూలుగా అనే మాట. ఇచ్ఛా స్వాతంత్ర్యం లేదంటే కోర్టులూ, జైళ్లూ, న్యాయశాస్త్రాలూ తప్పు చేసిన వాళ్ళను శిక్షించడమూ, అంతా అనవసరమైన పిచ్చి తుగ్లక్ వ్యవహార మౌతుందని అందరికీ భయమే. బూర్జువా నాగరికత పునాదులే కూలిపోతాయి.

ఈ ఇచ్ఛా స్వాతంత్ర్య సమస్యకు కూడా ''ఆవశ్యకతను గుర్తించడమే స్వాతంత్ర్యం'' అనేదే సమాధానం.

ఇచ్ఛా స్వాతంత్ర్యం అంటే ఏ కారణమూ లేకుండా ఏదైనా కలుగుతుందనుకోవడమూ, కలగాలను కోవడమూ అవివేకం. కార్యకారణ సూత్రం మానవుని విజ్ఞాన సౌధానికి మూల స్తంభం. కారణం లేకుండా కార్యం వుండ గల్గితే మానవుని జ్ఞానమే నశిస్తుంది. ★

రా.రా. స్మారక సంస్థ సౌజన్యంతో (యింకా వుంది)

# మాట - మౌనం

- డా॥ సంజీవదేవ్

కాలం, స్థలం. ఈ రెంటి మీద ఆధారపడి ఉంటుంది అంటారు విశ్వసృష్టి సమస్తం.

కాలం శబ్దానికి చెందితే స్థలం రూపానికి చెందుతుంది. శబ్దం లేంది నిశ్శబ్దం, లేక మౌనం. రూపం లేంది నైరూప్యం, లేక శూన్యం.

మాట, మౌనం సహజీవనం చేయలేవు. మాట ఉంటే మౌనం లేదు; మౌనం ఉంటే మాట లేదు. రెండూ ఒకేసారి ఉండటానికి వీలులేదు, చీకటి వెలుగు ఒకేసారి ఉండజాలనట్లు.

మాటకు ముందుంటుంది శబ్దం, శబ్దానికి ముందుది మౌనం. అందుకే మౌనానికి నిశ్శబ్దం అని కూడ పేరు.

మౌలికంగా ప్రధాన అస్తిత్వం మౌనం. మౌనం నుంచి ఆవిర్భవిస్తుంది శబ్దం; శబ్దం నుంచి ఆవిర్భవిస్తుంది మాట. మాటన్నా శబ్దం అన్నా ఒకటి కావు. మాటకు అర్థం ఉంటుంది. కాని శబ్దానికి అర్థం ఉండదు. శబ్దం అంటే కేవలం చెవికి వినిపించే ధ్వని మాత్రమే. ఆ శబ్దాల నుండి మాట ఏర్పడుతుంది.

అంటే ప్రతి శబ్దం మాట కాదు కాని ప్రతి మాట మాత్రం శబ్దమే. మనం 'క' అని పలికినప్పుడు అది చెవికి వినిపించే శబ్దమే కాని మనసుకు అర్థాన్నిచ్చే మాట కాదు. 'మ' అన్నప్పుడు కూడ అందులో శబ్దం తప్ప అర్థం ఉండదు. 'ల' అన్నప్పుడు కూడ అందులో శబ్దం తప్ప అర్థం ఉండదు.

ఆ శబ్దాలు మ్రోగకముందు అంతా మౌనమే. ఆ మౌనం నుంచే 'క', 'మ', 'ల' అనే శబ్దాలు వెలువడి ఆ శబ్దాలు మూడూ కలిసే వరకు 'కమల' అనే మాటగా రూపొందాయి. అప్పుడు ఆ కమల అనే మాటకు అర్థం ఏర్పడింది. కమల అంటే తామరపూవు.

మౌనం శబ్దంగా రూపొంది, శబ్దం మాటగా రూపొందినపుడు అర్థం జన్మిస్తుంది. ఆ యర్థాన్ని విస్తరించే నిమిత్తం భాష ఏర్పరచబడింది. కొన్ని శబ్దాల కలయిక మాట అయినట్లుగా కొన్ని మాటల కలయిక ఒక వాక్యం అవుతుంది. ఒక శబ్దం ఇవ్వలేని అర్థాన్నిస్తుంది ఒక మాట. ఒక మాట ఇవ్వలేని అర్థాన్నిస్తుంది ఒక వాక్యం. దీన్నంతా కలిపి భాష అంటాం.

అయితే, మాటల భాష పుట్టకముందు మౌనభాష ఉండేది. ఆదిమ కాలంలోని మానవుల్లో నిత్య జీవితంలో ఉపయోగించుకునే భాష వాక్యం లేని, మాటలేని, శబ్దం లేని మౌన భాష. దీన్ని శరీరావయవాల కదలికల ద్వారా, అంగ భంగిమల ద్వారా, వివిధ దృశ్యవిన్యాసాల ద్వారా ఏర్పరచే వాళ్ళు. ఈ మౌనభాష చెవికి వినిపించేది కాక కంటికి కనిపించేదిగా మాత్రమే ఉండేది. ఇది శ్రవ్యభాషకాక దృశ్య భాష. ఇది వాచికంకాక ఆంగికం. అందుకే ఇది మౌనభాష.

చేతి వ్రేళ్లను తన వైపుకు త్రిప్పి ఊపితే ఎదటి మనిషిని రమ్మనీ, వ్రేళ్లను బయటికి త్రిప్పి ఊపితే పొమ్మనీ, నోటిదగ్గర చేయి పెట్టి ప్రశ్నార్థకంగా ఊపితే అన్నం తిన్నావా అనీ, మరో పద్ధతిగా నోటి దగ్గర చేతిని రూపొందిస్తే నీటిని త్రాగావా అని అర్థాన్నిస్తాయి. నేటికీ గ్రామాల్లోని వీథిబడుల్లో పిల్లల్లో ఇటువంటి మౌన ప్రదర్శన కనిపిస్తుంది.

నేడు ప్రదర్శించబడే నృత్యనాటకాలన్నీ కూడ ఆంగికాభినయ ప్రధానమైన మౌనభాషతో నర్తించే మూక ప్రదర్శనాలే. అసలు అభినయమనేది వాచిక ప్రాధాన్యానికంటే ఆంగిక ప్రాధాన్యం కలిగినదే.

మాటకు శబ్దం అమ్మ అయితే, మౌనం అవుతుంది మాటకు అమ్మమ్మ, మౌనానికి శబ్దం కూతురు కనుక.

సాహిత్యం ప్రధానంగా మాటలతో నిర్మించబడితే సంగీతం ప్రధానంగా శబ్దాలతో నిర్మించబడుతుంది. మాటకంటే శబ్దం ఎక్కువ సూక్ష్మమైంది. మాట అనేది భాషకు లోబడి ఉంటుంది, శబ్దం భాషకు అతీతంగా ఉంటుంది. కనుకనే ఒక భాషకు సంబంధించిన సాహిత్యం మరొక భాషాభాషులు ఆనందించలేరు, అనువాదంలో తప్ప. కాని ఒక దేశపు సంగీతాన్ని మరో దేశపు వారు ఆనందించగలరు, కారణం, సంగీతపు ప్రధాన మాధ్యమం పరిమిత మాధ్యమమైన భాషకాక పరిమితాలను దాటిన శబ్దం కనుక. సంగీతాన్ని వింటాం కనుక చెవి ఉన్న వాళ్లంతా దాన్ని విని ఆనందించగలరు. సాహిత్యాన్ని వినటం, కాని చదవటం కాని ప్రధానం కాక దాన్ని అర్థం చేసుకోటం ప్రధానం. సంగీతానికి ఇంద్రియానుభూతి ప్రధానమైతే సాహిత్యానికి బుద్ధి జనిత ఆలోచన ప్రధానం. ఆలోచనకు అర్థం ప్రధానం, అర్థానికి మాట ప్రధానం. అందుకే సంగీతమంత విశ్వజనీన మాధ్యమం కాదు సాహిత్యం.

అర్థం ప్రధానంగా గల మాట కంటే అర్థాన్ని అధిగమించిన శబ్దం మౌనానికి ఎక్కువ దగ్గర. అందువల్ల మాట మౌనంగా మారాలంటే అది ముందు శబ్దంగా మారాలి; శబ్దం నిశ్శబ్దంగా మారాలి; అంటే మౌనంగా మారాలి. అదే విధంగా మౌనం మాటలోకి రూపొందాలంటే మౌనం ముందుగా శబ్దంలోకి మారి తరువాత మాటలోకి పరిణమిస్తుంది.

వస్తు జగత్తులో ప్రతి వస్తువూ రెంటిమీద ఆధారపడి తన అస్తిత్వాన్ని రుజువు చేసుకొంటుంది; అవి రూపం, మాటా. ప్రతి వస్తువుకూ ఒక రూపం ఉంటుంది, ఒక పేరు ఉంటుంది. పేర్లు భాషా భేదాలను కలిగి ఉంటే రూపాలకు అటువంటి భేదాలేమీ లేక విశ్వజనీనమై ఉంటాయి. గులాబీ పూవును ఏ దేశవాసులైనా చూచి గుర్తిస్తారు. కాని దాని పేరును గుర్తించలేరు. దాని పేరు తమ తమ భాషల్లో వేరు వేరుగా ఉంటాయి. శబ్దం విశ్వజనీనమైంది, రూపం విశ్వజనీనమైంది, కాని మాట మాత్రం విశ్వజనీన మైంది కాదు. రూపానికంటే, శబ్దానికంటే కూడ ఎక్కువ విశ్వజనీనమైంది మౌనం. మౌనం ఎంత విశ్వజనీన మైందో అంత జటిలమైంది కూడ అవగాహనకు. అది అతీంద్రియ గ్రాహ్య అస్తిత్వం. ఇదే స్థితి శూన్యాంది కూడ.

మౌనాన్ని వినగలగాలి, శూన్యాన్ని చూడగలగాలి. ఆ ప్రయత్నమే స్మరణాతీత కాలం నుంచీ మానవావళిలో జరుగుతూ వస్తూ ఉంది. ఆ సాధనలోని భాగమే కళ్లు మూసుకోటం, చెవులు మూసుకోటం అనేవి. మౌనాన్ని వినాలంటే చెవులు పనికిరావని, శూన్యాన్ని చూడాలంటే కళ్లు పనికి రావని. చెవికి మించిన ఇంద్రియం మాత్రమే మౌనాన్ని వినగలదు.

కంటికి మించిన ఇంద్రియం మాత్రమే శూన్యాన్ని చూడగలదని. అటువంటి దాన్నే అన్నారు ఆరవ ఇంద్రియం అని.

శూన్యానికంటే మౌనం ఎక్కువ ప్రభావం కలది. మౌనంలోనుంచి శబ్దం వచ్చినట్లే శూన్యంలో నుంచి రూపం వస్తుందని. అయితే శూన్యంలో నుంచి వచ్చిన రూపం నిలిచిపోతుంది అదృశ్యం కాకుండా. కాని మౌనంలో నుంచి వచ్చిన శబ్దం తిరిగి మౌనంలో లీనమైపోతుంది. ఒక చిత్రమో శిల్పమో కళాకారుని ద్వారా శూన్యంలో నుంచి రూపజగత్తు లోకి వచ్చి తిరిగి వెళ్ళిపోకుండ ఉండిపోతుంది చాలా కాలం వరకు. కాని శబ్ద విషయంలో ఈ పద్ధతి కుదరదు. సంగీత శిల్పి ఒక రాగాన్ని ఆలాపిస్తాడు. ఆలాపించినంత కాలం మాత్రమే ఆ రాగం వినిపిస్తుంటుంది. గాయకుడు ఆలాపించటం ఆపగానే ఆ రాగం మాయమై పోతుంది వినిపించకుండా. ఆ గానం ప్రారంభం కాకముందు మౌనం, అది అంతమొందిన తరువాత తిరిగి మౌనం. సంగీతమంటే రెండు మౌనాల మధ్య నిలిచే కళ మాత్రమే. అందుకే శూన్యానికంటే మౌనం ఎక్కువ బలీయమైంది!

మౌనం మాటను సృష్టిస్తుంది కాని మాట మౌనాన్ని సృష్టించదు, దాన్ని భగ్నం చేస్తుంది. మాట లేనంత వరకే మౌనం, మాట ప్రవేశించిన తరువాత మౌనం మాయమవుతుంది. కనుక పై అర్థంలో మౌనం నిర్మాణాత్మకం, మాట నిర్మూలనాత్మకం. మౌనంచేత సృష్టించ బడిన మాట తన ఉనికితో మౌనాన్నే నశింపచేస్తుంది. మౌనాన్ని మాట శాశ్వతంగా నశింపజేయదు, తాను ఉన్నంత కాలం మాత్రమే నశింపచేసి తాను నశించగానే జీవింప చేస్తుంది! దీని అర్థం మాట మౌనాన్ని సృష్టించటం కాదు, తాత్కాలికంగా తాను కప్పిన ముసుగును తొలిగించటం.

మౌనం అనేది మనిషికి వ్యక్తిగత సొత్తు, మాట అనేది సామూహిక సొత్తు. మౌనం మానసికం, గుప్తం; మాట వ్యావహారికం, వ్యక్తం. వ్యావహారిక జగత్తంతా మౌనం మీద కాక మాటల మీదనే ఆధారపడి ఉంటుంది. మాటలేంది మనిషి జీవించ లేడు, మధ్య మధ్య మౌనం ఉంటున్నా కూడ. జీవితంలోని ప్రతి చిన్న పనికీ పెద్ద పనికీ కూడ మాట అవసరం.

తల్లి కడుపున జన్మించినపుడే మౌనం అంతరించి శబ్దం ప్రత్యక్షమవుతుంది. శిశురోదన శబ్దమే కాని మాట కాదు. క్రమేణ శిశువు పెరుగుదలతోపాటు శబ్దం కూడ పెరుగుతుంది మాటలోకి. తిరిగి మరణశయ్యమీద మాట శబ్దంగా మారసాగుతుంది.

మాట విచిత్రమైంది. ఒక మాటకు ఒకే అర్థం ఉన్న మాటలున్నాయి, ఒకోమాటకు ఒకటికి మించిన అర్థాలున్న మాటలున్నాయి. అదేమాదిరి ఒక అర్థానికి కొన్ని మాటలుండేవి కూడ ఉన్నాయి. సత్యాన్ని వ్యక్తం చేసే మాటలు కొన్ని ఉంటే సత్యాన్ని గుప్తం చేసే మాటలు కొన్ని ఉంటాయి. కొన్ని మాటలు పాటలవుతాయి. పాటలు ముదిరితే ఆటలవు తాయి. కొందరు పరిణత మనస్కులు మౌనంతో శాంతిని పొందుతుంటే మరికొందరు మాటల్లో శాంతి పొందుతుంటారు. కొందరు మౌనంతో అశాంతిని పొందేవారు కూడ ఉంటారు. మనోవైజ్ఞానికుల అభిప్రాయం ప్రకారం ఆలోచన కూడ వినిపించని మాట అనే. ఆలోచిస్తున్నంతసేపు, వినిపించని మాటలు పనిచేస్తూనే ఉంటాయని.

అసలు మౌనం అంటే శబ్దం లేంది అనికాదు. శబ్దం లేంది మౌనమైతే శబ్దంలేని దానినుంచి శబ్దం ఎట్లా ఉద్భవిస్తుంది? ఉన్నదాన్నుంచి ఉంటున్నది ఉద్భవిస్తుంది కాని ఏమీ లేని

దానినుంచి ఏమైనా ఎట్లా ఉద్భవిస్తుంది? మౌనం నుంచి శబ్దం పుడుతుందీ అంటే మౌనంలో అతి సూక్ష్మరూపంలో శబ్దం నిద్రాణ స్థితిలో ఉండి ఉన్నట్లే. ఆ నిద్రాణ చేతన మేల్కొన్నప్పుడు శబ్దం వ్యక్తమవుతుంది. మనం దేన్నయితే మౌనం అంటున్నామో అది శబ్దం లేంది అని కాదు, నిద్రాణమైన శబ్దాన్ని కలిగి ఉన్నదని. మన చెవికి అందనంత సూక్ష్మశబ్దం అన్న మాట. అదే విధంగా శబ్దంలో మాట ఇమిడి ఉంటుంది. అంటే శబ్దం అంటే ప్రచ్ఛన్న వాక్కు అన్నమాట. అదే సూత్రం అర్థానికి కూడ చెందుతుంది. అందుకే వాక్కుకూ, అంటే మాటకూ అర్థానికీ భేదం లేదని.

సరే ఏది ఏమైనా శూన్యం అనేది నెగెటివ్ అస్తిత్వం కాదని. మౌనం అనేది ఒకటే అయి దానినుంచి భిన్న భిన్న శబ్దాలు ఉత్పన్నమవుతున్నాయా, లేక భిన్న భిన్న మౌనాలు న్నాయా? ఏదైనా కావచ్చు; ఏది కావటం అసంభవం కాదు. విభిన్నమైన భౌతిక సృష్టిఅంతా ఒక మూలద్రవ్యం నుంచి ఆవిర్భవిస్తుందా? నూరుకుమించిన మూలద్రవ్యాల ద్వారా విశ్వ సృష్టి జరుగుతుందనేది వైజ్ఞానిక సత్యం.

మాట అనేది మనిషిలో మాత్రమే ఉంటుంది, మిగతా జీవులలోనివి శబ్దాలు మాత్రమే అని. కొన్ని జంతువుల అరుపులు మాటలకు దగ్గరలో ఉన్నట్లు కూడా వినిపించవచ్చు. మొత్తంమీద ప్రాణికోటిలో మాట అనేది మానవునిలో మాత్రమే వికసించి ఉన్నదనేది నిర్వివాదాంశం. జంతువులలో మౌనం ఎక్కువ శబ్దం తక్కువా ఉన్నట్లు గోచరిస్తుంది. వాటి నోర్లు తినటంతోనే ఎక్కువగా ఆక్రమించబడి ఉన్నందున వాటిలో మౌనమే ఎక్కువగా వ్యాప్తి చెంది ఉంటుందనిపిస్తుంది. మనషి నోరు ఎక్కువగా మాటలతోటే నిండి ఉండటంతో అందులో మౌనభాగం తక్కువ ఉంటుంది.

మాట అనేది ఒక శ్రవ్య ప్రతీక. వస్తువుకూ, దాన్ని తెలిపే మాటకూ పోలిక ఉండదు. కొండ అన్నపుడు ఆ కొండ అస్తిత్వానికీ కొండ అనే మాటకూ సంబంధం లేదు. మరి కొండ అనే ఆ వస్తువుకు కొండ అనే పేరు ఎట్లా వచ్చిందో తెలియదు. కొన్ని శబ్దానుకరణమైన మాటలకు ఆ వస్తువులకు పోలికలుంటాయి. సంస్కృతంలో 'ప్రావృట్' అంటే వర్షాకాలమని. వర్షా కాలంలో గోండ్రుకప్పలు ప్రావృట్ ప్రావృట్ అని శబ్దం చేస్తుంటాయి. కనుక వర్షాకాలానికి ప్రావృట్ అనే పేరు కూడా ఏర్పడింది: నీరు ప్రవహిస్తుంటే జల జల అనే శబ్దం వినిపిస్తుంది. అందుకే నీరుకు జలం అనే పేరు ఏర్పడింది. పుల్లలను విరుస్తుంటే పృథక్ పృథక్ అనే శబ్దం అవుతుంది. కనుక వేరు వేరు అనే దానికి పృథక్ అనే మాట ఏర్పడింది. ఈ విధంగా వస్తువుకూ, ఘటనకూ సంబంధించిన కొన్ని మాటలకూ, విషయాలకూ కొన్ని పోలికలుంటాయి. కాని ఇటువంటి మాటలు చాలా తక్కువ మాత్రమే ఉంటాయి. ఎక్కువగా ఉన్న మాటలన్నీ కూడ పోలికలు లేనివే. కనుకనే మాట అనేది శ్రవ్య ప్రతీక అనిపించుకొన్నది.

ప్రతిచోటా మాటలుంటాయి కాని మౌనం ఉండదు. జగత్తు అంతా శబ్దమయం, ఇక ప్రజలున్న తావులన్నీ మాటలమయం. సర్వత్ర మాటలు వినిపిస్తాయి, ఇంకా ఇతర శబ్దాలు వినిపిస్తాయి కాని మౌనం వినిపించదు. అసలు మౌనం అనేది వినిపించటం ఎట్లా సంభవం? మౌనం అనేది వినిపిస్తే అది మౌనం ఎందుకవుతుంది? వినిపించంది కనుకనే అది మౌనం అయింది. వినిపించే మౌనం అంటే పిల్లల గన్న గొడ్రాలు అన్నట్లుంటుంది. అయినా కొందరు లోకోత్తర సాధకులు మౌనాన్ని వినటానికి సాధన చేస్తూనే ఉన్నారు, అన్ని కాలాల్లో అన్ని

దేశాల్లో. చుట్టూ ఉన్న శబ్దాలను మాటలను వింటూ తాము మాత్రం మాట్లాడక కూర్చోటం మాత్రమే మౌనాన్ని పాటించటం కాదు. చెవుడు లేకున్నా కూడ చుట్టూ మ్రోగే శబ్దాలను, మాటలను వినకుండా ఉండగలగటం నిజమైన మౌనం, అదొక వైయక్తిక మానస స్థితి. అందువల్ల మనిషికి ప్రయోజన మేమి అంటే రణగణ ధ్వనినుంచి సున్నిత నాదంలోకి ప్రవేశించినపుడు ఆనందం కలుగుతుంది. సున్నితనాదం నుంచి అంతకంటే ఎక్కువ సూక్ష్మనాదం గల మౌనాన్ని వినటం ఇంకా అధికానందం అని.

ఈ పరమాణు యుగంలో స్థూలం నుంచి సూక్ష్మం వైపుకు పయనిస్తుంది ప్రతి విషయం కూడ. రూపాన్ని దాటిన చిత్ర రచనను, శిల్ప నిర్మాణాన్ని చేయాలని ఆధునిక రూపకారులు ప్రయత్నిస్తుంటే, కవులు ప్రయత్నిస్తున్నారు మాటలను దాటిన కవిత్వాన్ని సృష్టించాలని. మాటలను దాటిన కవిత్వం అంటే మౌన కవిత్వమే. ఆర్చి బాల్డ్ మెక్లీష్ అనే కవి అందుకే అంటాడు, "A Poem should be wordless/As the flight of birds" అని. ఇక్కడ విచిత్రమేమంటే మాటలులేని కవిత కావాలని మాటలలోనే చెపుతాడు ఆయన! దాన్ని మాటలు లేకుండా చెపితే సమంజసంగా ఉండేది! ఇంగ్లీషు భాష వద్దని ఇంగ్లీషులో చెప్పినట్లుంటుంది.

ఏది ఏమైనా, ఒకటి మాత్రం వాస్తవం; నేటి జగత్తు స్థూలాన్నుంచి సూక్ష్మానికి ప్రయాణం చేస్తుంది. ప్రతిరంగంలోను, వైజ్ఞానికంగాను, కళాత్మకంగాను, అదే ఆధునిక జీవితపు అన్ని అంశాల్లో ప్రత్యక్షమవుతూన్నది. జీవనయాత్ర 'మహతో మహీయాన్' నుంచి 'అణోరణీ యాన్' వైపుకు మొగ్గుతూన్నది.సూక్ష్మంలో మోక్షం అని మనకు వాడుక పదమే ఉన్నది. మినీ కవిత అనేది విరివిగా వ్యాప్తిలో ఉన్నది. దీనితో సంతృప్తిపడని సూక్ష్మత్వపు ప్రేమికులు ప్రపంచం అంతటా అసలు మాటలే లేని కవిత్వాన్ని రూపించాలని. ఈ మాటలు లేని కవిత్వాన్ని మౌనకవిత్వం అనవచ్చు. ఇది సంభవమా అసంభవమా అనే ప్రశ్న అవసరం లేదు, ఆశయం చాలా గొప్పది, సందేహం లేదు. ఆచరణ కందని కొన్ని గొప్ప ఆశయాలుం టాయి. మాటలు లేని మౌనకవితా సృష్టి. కూడా అటువంటి ఒక గొప్ప ఆశయం!

మాట నుంచి మౌనానికి పయనించే బాట ఏనాటిదో తెలియదు. అది ఈ నాటికీ వాడుకలోనే ఉండిపోయింది. ఆ బాటలోని బాటసారులు నాటినుంచి నేటివరకు అజస్రంగా తమ పయనం సాగిస్తూనే ఉన్నారు; ఇంకాముందు సాగిస్తారు కూడ.

మాటకావల శబ్దం ఉన్నది. శబ్దానికావల మౌనం ఉన్నది. మరి మౌనానికావల ఏము న్నట్లు? మౌనానికావల ఉన్నది మహామౌనం!

(విజయవాడ ఆకాశవాణి సౌజన్యంతో)

*Music being an exceptionally creative art, the rules which govern its theory and practice are relatively flexible, compared to the rules which govern the grammar and composition of language. The universality of music depends on the degree of its symmetry.*

**M.V. Ramakrishnan in Hindu**

(ఊహాజనిత ఇంటర్వ్యూ)

# తాపీ ధర్మారావుతో మధురవాణి

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

(దేవాలయం మంటపంలో కూచుని గిరీశం చుట్ట చుట్టుగుంటూ టుమ్రీ విసురుతూ వుంటాడు. తాతాజీ వెంకటేశాన్ని వెంట బెట్టుకుని దేవాలయం మీది బూతుబొమ్మల్ని చూపిస్తూ శిష్యుడికి వివరిస్తూ వుంటారు.)

మధురవాణి : కుర్రవాడ్ని పాడు చేస్తున్నారు గురువుగారూ!

తాపీ ధర్మారావు : ఆదిలోనే హంసపాదు. నేనింకా శిష్యుడికి పెళ్ళి 'దాని పుట్టుపూర్వోత్తరాలూ' చెబుతామనుకుంటూ వుంటే -

మధురవాణి : మీరివన్నీ తెలుసుకున్నాకే పెళ్ళి చేసుకున్నారా? గిరీశంగార్నడిగితే దేవాలయాల మీద బూతు బొమ్మలు వుండాల్సిందే. ఎ మస్టు అంటారు. అవిలేకపోతే దేవాలయాలకు ఎవరు వెళ్తారు? వెళ్ళి ఎవరు ప్రదక్షిణలు చేస్తారు?

తాపీ ధర్మారావు : అది సర్లె కాని, నీలాంటి రసికురాలి చేతిలో భగవద్గీత పెడతాడా సౌజన్యారావు పంతులు? తల్చుకుంటేనే నాకు వళ్ళు మండుకొస్తూంది.

మధురవాణి : మరేం పెడితే బాగుండునని మీ అభిప్రాయం?

తాపీ ధర్మారావు : ఏ జయదేవుడి గీత గోవిందమో లీలాశుకుని కృష్ణలీలా తరంగిణో...

మధురవాణి : అయితే భగవద్గీత ఎవరికిస్తే బాగుండేదంటారు?

తాపీ ధర్మారావు : గిరీశానికి పనిష్మెంటుగా.

మధురవాణి : (నవ్వు) నేను మటుకు చదివానేమిటి?

తాపీ ధర్మారావు : మరేం చేశావు పంతులు నీ కిచ్చిన పుస్తకాన్ని?

మధురవాణి : నాదగ్గరెందుకని మా అమ్మకు తోలేశాను.

తాపీ ధర్మారావు : ఔరా! నీ చాకచక్యం.

మధురవాణి : ఆంధ్ర విశారద అన్న బిరుదు మీ కెవరిచ్చారో?

తాపీ ధర్మారావు : శృంగపురాధినాథుడు ప్రసిద్ధ జగద్గురు శంకరుండు న
న్నుంగని ''శారదాంబిక కనూ కటాక్షము గల్గె; నింకఁ బూ
జంగను ముత్తమోత్తమ యశంబుల ''నాంధ్ర విశారదా'' యటం
చుం గరుణాతిరేకమునఁ జూపఋలెన్న బహూకరించినన్

మధురవాణి : ఆ రోజుల్లో రామ్మూర్తి పంతులు గారిని ప్రతిఘటించి నిలిచిన మీ గ్రాంథిక భాషావాదం కబుర్లు సెలవిస్తారా, వింటాం.

తాపీ ధర్మారావు : యాభయి సంవత్సరాల నాటి మాట. అప్పుడే శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారు గ్రాంథిక భాష మీద ధ్వజమెత్తారు. వారి వాదనను ప్రతిఘటించాలి. మూడేళ్ళకు ముందు నేను పర్లాకిమిడి కాలేజిలో వారి శిష్యుడను, వారి జ్ఞానము, దీక్ష, వాదన పటిమ బాగా ఎరుగుదును, నాకా! గ్రాంథిక భాషాభిమాన బలము తప్ప వేరు సాయము లేదు. శ్రోతల ఆదరణ నార్జించుకోవడానికి ఒక ఉపాయముగా చిన్న కల్పనతో చంపక మాలికా పద్యరూపమున నా వాదనోపన్యాసాన్ని ప్రకటించాను.

మధురవాణి : మిమ్మల్ని ఎవరూ ఎదుర్కొనలేదా?

తాపీ ధర్మారావు : లేకేమి. నా చంపకమాలికకు ప్రత్యుత్తరమా అన్నట్లు శ్రీ సెట్టి లక్ష్మీనరసింహం మేష్టారు ఒక శార్దూలమాలిక ప్రకటించి నా వాదాన్ని ఖండించారు లెండి.

మధురవాణి : అయితే యీ కలభాషిణి యెవరు?

తాపీ ధర్మారావు : నా చంపకమాలికలో ''తెలుంగనెడు కాంత'' కథ చాలామంది పండితుల అభిమానాన్ని సంపాదించుకుంది. ఆ ప్రోత్సాహంతో నేను ఆ కాంతకు కలభాషిణి అన్న పేరు పెట్టి ఆమె స్వీయచరిత్ర రూపంగా ఆంధ్ర భాషా చరిత్రను శ్రీ వీరేశలింగం పంతులు గారి వరకు వ్రాశా. వేగుజుక్క గ్రంథమాలలో 1911లో యిదే ప్రథమ పుస్తకంగా ప్రచురించాము. ఆ పుస్తకం పేరు ''ఉషః కాలము''.

మధురవాణి : అవి ఎలాటివో మచ్చు చూపిస్తారా?

తాపీ ధర్మారావు :- నిలయము జెంద గ్రామ్యమను నిక్కపు పాదరసంబు గూర్చి వ
న్నెల కనకంబు మా తెలుగు నీరసమౌనటు జేయకుండ, మ
మ్మలరగజేసి, మీరు సుఖమందుచు నుండు, డటంచు గోరి, దో
సిలి నొనరించి మ్రొక్కెదను చేకొను డార్యులు, ధర్మరాయుడన్

మధురవాణి : తరవాత -

తాపీ ధర్మారావు : మరి యిరవైయేళ్ళ తరువాత భాషను గురించి నా అభిప్రాయాలు మారాయి. భాషాభ్యుదయానికీ, ప్రజల విజ్ఞానాభివృద్ధికీ, రచనలు వ్యావహారికంలో వుండాలన్న దృఢ విశ్వాసం కలిగింది. అందుచేత యీనాడు ఈ ''చంపకమాల''లోని విషయం నిరుపయోగమయిందనే చెప్పాలి.

మధురవాణి : ఇదంతా పాత పాళీ వ్యవహారమన్న మాట. మరి కొత్త పాళీ అంటే ఏమిటి?

తాపీ ధర్మారావు : కవులకూ, ప్రజలకూ మధ్యను పెరిగిపోయిన కొండలూ, అడవులూ పోవాలన్నా రచనలు వ్యావహారిక భాషనే సాగాలన్న నమ్మకం కుదిరింది. ఆ నమ్మకాన్నే ''కొత్త పాళీ'' గ్రంథ రూపంగా 1956లో ఆంధ్ర మహాజనులకు అందజేసుకున్నా. ఆ భాషలోనే దినపత్రికను వార పత్రిక లను నిర్వహించి సినిమాలలో - పౌరాణిక చిత్రాలలో కూడా వ్యావహారిక

భాషనే అందరూ అంగీకరించేలా ఉపయోగించా. ఈనాడు ఎవరో ఎక్కడో విశ్వనాథలాంటి వారు తప్ప త్రిపురనేని వారూ కూడా అంతా వ్యావహారికానికి తరలిపోయారు.

మధురవాణి : శ్రీ శ్రీ గ్రాంథికం కలవారి భాషనీ వ్యావహారికం పేదల భాష అనీ అన్నారు. మీరు ఆ విభజనను అంగీకరిస్తారా?

తాపీ ధర్మారావు : అది అతను చమత్కారం కోసం అని వుంటాడు. భాషకు వర్గ స్వభావాన్ని అంటగట్టడం దుస్సాహసమే.

మధురవాణి : దేశోద్ధారకుల జాబేమిటి?

తాపీ ధర్మారావు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారి స్వహస్తాలతో విచిత్రమయిన జాబు వచ్చింది. ''ఈ సంవత్సరం గూడా తమ రచనతో ఆంధ్రపత్రిక ఉగాది సంచిక సలంకరించవలసింది అని. అప్పుడు నేను నెల్లూరిలో వున్నా. చుండీ జమీందారుకు ప్రభుత్వము నియమించిన సంరక్షకోపాధ్యాయునిగా. ఆ జాబందినప్పుడు నా పరిస్థితి ఎలాగుండేదంటే; నాకు ఆనాడున్న ఆస్తి అంతా బంగారము, వెండి, రొక్కము వెలగల వస్త్రము అన్నీ దొంగలపహరించుకు పోయారు.

మధురవాణి : రామ! రామ! మరి అప్పుడు రాశారా?

తాపీ ధర్మారావు : కావ్య రచన పేరు 'దొరకక చెప్పు లెట్టులని తొంటి కవీశులు సాటం గూడదే' అనే మకుటంతో కొన్ని పద్యాలు వ్రాసి పంపా.

మధురవాణి : మీ ప్రత్యేక విషయం గణితశాస్త్రం కదా మీరివన్నీ ఎలా పట్టించుకున్నారు?

తాపీ ధర్మారావు : మళ్లీ చెబుతున్నా. ఆంధ్ర సారస్వతం నా అభిమాన విషయం. విశేష పఠనం టాల్ బోయ్ వీలర్ దొర వ్రాసిన ఇండియన్ హిస్టరీ ఆ రోజుల్లో.

మధురవాణి : చరిత్ర వల్ల ప్రభావితులై ఏమైనా రాశారా?

తాపీ ధర్మారావు : విజయనగరరాంజనేయులు అని వ్రాశా. నేను చదివిన చరిత్ర పుస్తకంలోదే ముజాహిద్ షా కథ. మన చరిత్ర పుస్తకాల్లో యీ కథ కనబడదు.

మధురవాణి : ఏమిటా కథ?

తాపీ ధర్మారావు : భామినీరాజు ముజాహిద్ షాహి చేతులారా ఒక ఆంజనేయ ప్రతిమను గండ్ర గొడ్డలితో నరకబోతాడు. ఒక ముసలి బ్రాహ్మడు అడ్డు వస్తాడు. షాహి మొదట అతడ్ని నరికి, తరువాత విగ్రహాన్ని కొట్టి తన కసి తీర్చుకొని పోతూ వుంటాడు. కొన ఊపిరితో ఆ బ్రాహ్మడు మహా పరితప్తమయిన హృదయంతో షాహిని శపిస్తాడు. దాని ఫలితమా అన్నట్లు, ముజాహిద్ షాహి తన యిల్లు చేరకుండా, దారిలోనే, నీచ మయిన చావు చచ్చాడు.

మధురవాణి : యిలాటి హిందువుల్ని ముసలీ ముతకా భేదం లేకుండా వధించి, విగ్రహాలు ధ్వంసం చేసిన వీరి వారసులు 15 ఆగష్టు 1947 తరువాత సెక్యులర్

రాజ్యాంగంలో మైనారిటీలయి పోయి మన వారి కంటె ఎక్కువ హక్కుల్తో కాం(గెసు వారి దయవల్ల మన నెత్తి మీదెక్కి తొక్కుతున్నారు.

తాపీ ధర్మారావు : నీకు కాం(గెసు అంటే పడదా?

మధురవాణి : ఈ మహమ్మదీయ మహాయుగం నాటి దురాగతాల్ని హిస్టరీ కాం(గెస్ వాళ్ళు ఎలా తిరగరాయిస్తారో - మన సెక్యులర్ కాం(గెస్ యిష్టానుసారం తిమ్మిని బ్రహ్మి బ్రహ్మిని తిమ్మి చేస్తారు కావును.

తాపీ ధర్మారావు : ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వ కారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం

మధురవాణి : మీ కమ్యూనిస్టులు కూడా హిందువులకే పాపం మతోన్మాదం అంటగడుతున్నారు. కాం(గెసు యిటువంటి భ్రష్ట రాజకీయాలు మైనారిటీలను నెత్తికెక్కించుకొని ఆడటం దేనికంట?

తాపీ ధర్మారావు : ఎన్నికల ప్రయోజనాలు దృష్టిలో పెట్టుకొని ఆడే నాటకం. రాజకీయ నాయకుడెప్పుడూ రాబోయే ఎన్నికల గురించే ఆలోచిస్తాడు.

మధురవాణి : సరె వార్ల గొడవ అలా వుంచి - రాగి డబ్బు గురించి చెప్తారా?

తాపీ ధర్మారావు : ఆనిబిసెంట్ రోజులవి. 1916 దీపావళి వచ్చింది. దీపావళి వసూళ్ళు జమచేసి నాయకుల కందజేసే వారం. అప్పుడు నేను విశాఖపట్నంలో గణిత శాస్త్రోపాధ్యాయుడిని. ఉత్సాహంతో వున్న కొందరు విద్యార్థులకు డబ్బా లిచ్చి వసూళ్ళకు వెళ్ళమన్నా, బోణీ మీరే చెయ్యండి అన్నాడొకడు. సరే అని, అన్ని డబ్బాలలోను కాసులు (రాగి డబ్బులు) వేసి పంపించాను.

మధురవాణి : ఓహో అదా రాగి డబ్బు అంటే -

తాపీ ధర్మారావు : లేదు. ఇంకా ఉంది విను. సాయంత్రం అయిదు గంటల వేళకు హిందూ రీడింగ్ రూం మెట్లెక్కుతుండగా నా విద్యార్థులలో ఒకడు నా ముఖం దగ్గిర డబ్బా వాగిస్తూ దీపావళి వసూళ్ళు సార్ అన్నాడు. నా జేబులో ఒక అర్థణా డబ్బు మాత్రం వుంది. అర్థణా ఆ డబ్బాలో వేస్తూ - చుట్టల కోసం ఉంచుకున్నా నబ్బాయీ'' అన్నా. అక్కడి నా స్నేహితుడొకడు ''అంత కంటె మంచికే వినియోగం అవుతూ వుంది సంతోషించు'' అన్నాడు. దానితో ఊహలు రేగాయి. ఎన్నింటికో ఉపయోగమయ్యే ఆ రాగి డబ్బు దేశసేవకు వినియోగపడుతూ ధన్యమయిందని అనుకున్నా. ఇంగ్లీషులో ఆటో బయా(గఫీ ఆఫ్ ఎ షిల్లింగ్ అనే ద్వ్యర్థి రచన వెలువడింది. మనమెందుకు యీ రాగి డబ్బు చరిత్ర వ్రాయకూడదు అనిపించింది.

మధురవాణి : బాగు బాగు శ్రీ శ్రీ గారన్నట్లు మొత్తానికి కవితామయమేనోయ్ అన్నీ అని ఆయన మాటా రుజువు చేశారు.

తాపీ ధర్మారావు : శ్రీ శ్రీ కంటె చాలా ముందు మాట. అతను భావ కవిత్వ యుగంలో పుట్టాడు, మే వల్లా క్కాదు.

మధురవాణి : సంప్రదాయ కవిత్వమా? భావకవిత్వమా? దేన్ని మీరు ఎక్కువగా అభిమానించారు?

తాపీ ధర్మారావు : ప్రబంధ కవిత్వ సంప్రదాయంలో వున్న మాకు ఈ భావకవిత్వం కొంచెం వెగటుగా వుండేది.

మధురవాణి : ఎందుచేత?

తాపీ ధర్మారావు : వంగదేశ వాసనా ఇంగిలీసు ఎంగిలీ అని అనుకునే వారము; వారి పెడజాలం ప్రణయ ప్రకోపం ఉపమాన సరళి చూసి నవ్వుకొనే వారం.

మధురవాణి : కొత్తని ఆహ్వానించడానికి చాలా ధైర్యం కావాలి. గతానుగతికో లోకః. నలుగురు నడిచే బాటను నడవటం సుళువు. కొత్త మార్గం వెయ్యటం ఆ మార్గాన నడవటం అంత సులభం కాదు.

తాపీ ధర్మారావు : కొందరు సిద్ధహస్తుల రచనలలోని గుణాధిక్యము గుర్తించి లోలోన మెచ్చుకోకపోలేదు. కాని ఆనాటి భావకవులలో కొందరు ప్రబంధకవులను అవహేళన చేస్తూ ప్రసంగాలు చేయడం సహించలేకపోయేవారం.

మధురవాణి : మొత్తానికి మీరు చాలా పేచీకోరు మనిషే -

తాపీ ధర్మారావు : నేను పాత కొత్తల మేలు కలయిక

మధురవాణి : (నవ్వి) కాదు Sad (సాడ్ ) కలయిక. భావకవిత్వం వెనువెంట మనకు కాల్పనిక సాహిత్యం నవల కథానిక అన్నీ వచ్చాయి గదా మీరే దిక్కున్నారు?

తాపీ ధర్మారావు : మేము పండిత కవుల పక్షం నుంచి ప్రజల పక్షానికి రావడానికి చాలాకాలం పట్టింది. నేను కూడా మూడు నాలుగు ముత్యాల సరాలు వ్రాసి నా ప్రణయ హృదయాన్ని ఒలకబోశాను. ఆ ఖండకావ్యం చిన్న పుస్తకంగా అచ్చు వెయ్యమని ముద్రాలయానికిచ్చాను.

మధురవాణి : అన్నట్లు మీ ప్రేయసి ఎవరు? (నవ్వు)

తాపీ ధర్మారావు : వుండు చెప్పనీ. తీరా పుస్తకం అచ్చయిన తర్వాత చూస్తే ఏముంది? 'ణ' బదులు 'ళ' పడ్డది. ప్రణయం ప్రళయం అయింది.

మధురవాణి : ప్రెస్సు వాళ్ళని నిలదీసి అడగలేదా మీరు? (నవ్వు)

తాపీ ధర్మారావు : అయ్యో అడిగా అడగకేమి? క్షమించండి. ఆ పద్యాలలో మీరు వర్ణించిన దురవస్థ అంతా ప్రణయానికంటె ప్రళయానికే బాగా సరిపోతుంది కదా అన్నాడు ఆ కంపోజిటర్.

మధురవాణి : దీనికని రాస్తే దానికి సరిపోతే మీరు భావకవిత్వానికి పనికిరారని తేలిపోలేదా (నవ్వు)

తాపీ ధర్మారావు : ఆ రోజులలో కొందరు భావకవులు ''మా కవిత్వం ఒక పాతికేళ్ళ దాకా మీకు బోధపడదు లెండి'' అని కొంత అహంభావంతో చెప్పుకొనే వారు. వీరంతా ఒకరు వ్రాసిన భావగీతాన్ని మరొకరు ఆకాశానికెత్తివేస్తూ ప్రశంసిస్తూ వుండేవారు. ఇదంతా మాకు దుస్సహంగా వుండేది. అది

ఆనాటి మా అభిప్రాయం. అది సమర్థనీయం కాకపోవచ్చు.

మధురవాణి : కొత్త కవిత్వం ఒక ఉప్పెనలా వచ్చిపడినప్పుడు పాత కొంత తుడిచి పెట్టుకుపోతుందిట. దాన్లో కొంతమంచి వున్నా అది కూడా నష్టపోతుంది అని గిరీశం గారు చెప్పారు.

తాపీ ధర్మారావు : చెబితే చెప్పాడు. ఏది ఏమైనా నేటి కవులు ఒక్క పూర్వ కవీశ్వరుడినయినా బాగా అర్థం చేసుకొని పఠించినట్లయితే మంచిది.

మధురవాణి : ముద్దుకృష్ణగారి వైతాళికులు మీరు చూడలేదా?

తాపీ ధర్మారావు : చూడకేమి - నేను చెప్పినవి వెనకటి సంగతులు. భావ కవిత్వం తరవాత అభ్యుదయ కవిత్వం శ్రీ శ్రీ ఆ వెనువెంట వచన కవిత్వం కుందుర్తి చాలా దూరం వచ్చింది.

మధురవాణి : భావ కవిత్వం అది ఎలా వచ్చిందో అలా మాయమయి పోయింది విచిత్రంగా - ఏమైనా 1890 లు గొప్ప సాహిత్య పురుషుల్ని ప్రభవించింది. అది అపూర్వమైన కాలం అని గిరీశంగారు చెప్తూండేవారు.

తాపీ ధర్మారావు : అన్నిటికీ వీడొకడు ప్రమాణం నీకు. పూటకూళ్ళమ్మ ఏం చేస్తోంది?

మధురవాణి : యంగ్ విడోన్ని యిద్దర్ని చేరదీసి విజయనగరం గంట స్తంభం దగ్గర చాసో గారి ప్రెస్ పక్కన భోజన హోటలు నడిపిస్తున్నది. కాలేజి కుర్రాళ్ళ జోరు అక్కడే.

తాపీ ధర్మారావు : రామప్పంతులిప్పుడేం చేస్తున్నాడు?

మధురవాణి : లుబ్ధావధాన్లు పోయాక మీనాక్షి రిచ్ విడో అయింది. మీనాక్షి పంచన చేరి కాలక్షేపం చేస్తున్నాడు. నన్ను చూస్తే మహా బెదురు - పూట కూళ్ళమ్మకి సలహాలిస్తూ వుంటాడు.

తాపీ ధర్మారావు : అప్పారావు గారు పోయినా వీళ్ళంతా చిరంజీవులే -

మధురవాణి : ఆంధ్ర తేజంబు గలదె యీ యవని నింక? సందియంబయ్యె - అని ఎందుకు రాశారు? ఇప్పుడు ఆంధ్రుడే ప్రధానమంత్రి కూడా.

తాపీ ధర్మారావు : విజయనగరాంజనేయములో అప్పుడట్లా రాశాను. తరవాత ఏదో మహాపాపం చేసినట్లు ఫీలయ్యాను.

దోసమూనెను మదికిదె దోసిలిడెద
నాంధ్ర తేజమ వందనం బందికొనుము

అని 1923 లో వ్రాసి ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటించా. సహాయ నిరాకరణోద్యమంలోగాని స్వాతంత్ర్యోద్యమంలో కాని యావద్భారత వర్షములోను ఆంధ్రులదే పైచేయి. గాంధీజీ నియమాలను తూచ తప్పక పాటించి ఎటువంటి త్యాగానికయినా తెగించిన వారు ఆంధ్రులే.

మధురవాణి : 'రాజుల్ పోదురు రాజ్యముల్ పోవు
కల కాలముండును కావ్య మొక్కటియె, అని
'నా పూలతోట యీ నా జన్మభూమి' అని రాసింది మీరే కదా!

తాపీ ధర్మారావు : నీకివన్నీ ఎట్లా తెలుసు?

మధురవాణి : ద్విపదలు వృత్తమాలికలు కొన్నాళ్ళకి విసుగెత్తించక తప్పవు.

తాపీ ధర్మారావు : అందుకే అభ్యుదయ కవులు తరవాతి తరంవారు మాత్రా ఛందస్సుల్ని పట్టుకున్నారు.

మధురవాణి : మీరేం తక్కువ తిన్నారా?

తొలి మీ చూపులు మాటలుం గుణము సంతోషంబుతో జూచి నా
కులభించుం గద యివ్వి సర్వమని కోర్కుల్ దీగలై సాగ, డో
లల నూగాడితి; నిప్పుడవ్విగని, వాల్లభ్యాప్తి వై మానికో
జ్జ్వల యానంబున సంచరించు బరితోషవ్యోమ మార్గంబులన్

(రాగ యుక్తంగా చదువుతుంది)

తాపీ ధర్మారావు : సెహభాష్ బేటీ. కావలసినంత శృంగారరసము దాంపత్య జీవితంలో వుంది అనడానికి, లేదనుకొని పైచూపులకు పోనక్కర లేదని 'దాంపత్యము - శృంగారము' అని వ్రాశా.

మధురవాణి : మీ టీచర్ గుణం అక్కడా పోనిచ్చుకున్నారు కాదు. పెళ్ళి గురించి రీసెర్చి చేశారనుకుంటా. ఈ మధ్య వెంకటేశం చేతిలో-'పెళ్ళి దాని పుట్టు పూర్వోత్తరాలు!' అన్న పుస్తకం చూశా. ఇదెందుకు? శుభ్రంగా పెళ్ళి చేసుకోమని చెప్పా.

తాపీ ధర్మారావు : అలా చెప్పకు. వాళ్ళు మ న ఆచారాలు వ్యవహారాలు ఏది ఎందుకు వచ్చిందో అన్నీ తెలుసుకున్నాక పెళ్ళి చేసుకుంటే గుడ్డి నమ్మకాలు లేకుండా హాయిగా వుంటారని నా ఆకాంక్ష.

మధురవాణి : ఎలా పెళ్ళాడినా కాపురం ప్రధానం.

తాపీ ధర్మారావు : పూర్వం పెళ్ళాడ్డం కలియడం పిల్లలు పుట్టడం యివన్నీ క్రమంగా జరుగుతాయని తెలీక - వేరనుకుని ఆలోచించే వారు. పెళ్ళెందుకు పెళ్ళంటే ఏమిటి చదివి ఆలోచించి పుస్తకం వ్రాశాను. జత కట్టడం ప్రకృతి పని; పెళ్ళి అన్నది మన పని. పూర్వం కామవాంఛ గలిగినపుడు జత కూడడమే సహజ కార్యం.

మధురవాణి : అవన్నీ మాకెందుకు చెబుతారు కాని కావలిస్తే కొనుక్కు చదువుకుంటాం - స్టాలిన్ భక్తుల గురించి మావోభక్తుల గురించి చెప్పండి వింటాం.

తాపీ ధర్మారావు : కమ్యూనిస్ట్ పార్టీకి చెందిన కొందరు స్టాలిన్ భక్తులుంటే వుండవచ్చు. మావో భక్తులు మరి కొందరు వుంటే వుండవచ్చు. మన సంస్కృతిని మనమతాన్నీ మన చదువులనీ గౌరవించే వారు లేనే లేరంటావా?

మధురవాణి : ఎవరైనా ఉన్నారేమో కాని కమ్యూనిస్టులు మాత్రం కాదు.

తాపీ ధర్మారావు : నీకు వారంటే ఎందుకు కినుక?

మధురవాణి : వారు ఎవరిని బలపరిస్తే వారు క్షీణించి ప్రాణావశిష్టులై పోతున్నారు (నవ్వు)

తాపీ ధర్మారావు : అంటే - నవ్వకుండా చెప్పు. చెప్పయినా నవ్వు.

మధురవాణి : కమ్యూనిస్టులు తెలుగుదేశాన్ని బలపర్చారు అది రెండు ముక్కలయింది. వారు మాత్రం గట్టిగా అలానే వున్నారు.

తాపీ ధర్మారావు : నువ్వు కాంగ్రెస్సా

మధురవాణి : కాదు. నేను మీ రెటుంటే అటు. నాకు మీ లా సంగతేమిటో తెలుసుకుందా మనీ - అంతే. అదే నన్ను పాడుచేసింది కూడాను.

తాపీ ధర్మారావు : దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు అలా పుట్టిందే - ఈ పరిశోధన 15 సంవత్సరాలు జరిగింది. ఈ విషయాలను గురించి కొన్ని జొన్న కర్రలోనూ, కొండెకాడులోనూ, ఓనమాలలోనూ, తాకీలోనూ వ్రాస్తూ వుండే వాడిని. చెప్పబోయేది కటువుగా వున్నా వర్ధన్నా మిత్రులు నా చేత రాయించారీ పుస్తకాన్ని.

మధురవాణి : దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు అనే పుస్తకమేనా?

తాపీ ధర్మారావు : ప్రజామిత్ర పత్రికలో వారం వారం పడిన ఈ వ్యాసాలకు ఆంధ్ర పాఠకులు చూపించిన ఆదరం అపారం.

మధురవాణి : ఆ రోజుల్లో నేనూ చదివి తిట్టుకున్నా - గిరీశం గారు తెచ్చేవాడు తాతాజీ రచనలు అంటూ.

తాపీ ధర్మారావు : దేవుడు అంటే ఆరోజులలో వాళ్ళకున్న అభిప్రాయాన్ని బట్టి సంగమ సమర్పణ ఒక మహా పవిత్రమైన కార్యం అయింది. అందుకు దేవాలయాలు మూల స్థానాలు.

మధురవాణి : ఇదే వాళ్ళకు ముఖ్యమైన పనిగావల్ను కర్మ! కర్మ! ఇంకేం డ్యూటీ లేనట్లు

తాపీ ధర్మారావు : సంగమ బుద్ధికి ఉద్రేకం కలిగించే విషయాలన్నీ దేవాలయాలకి ముఖ్యమైన అంగాలయ్యాయి. కోవెలలు రతికళామందిరాలయాయి, బూతు బొమ్మ లతో, గుడి చేటులతో, నపుంసక పండితులతో నిత్య సంగమాలతో కేళీ మందిరాలయాయి.

మధురవాణి : మరి చెప్పకండి. పూటకూళ్ళమ్మ వింటే చీపురుకట్ట తిరగేస్తుంది. (నవ్వు)

తాపీ ధర్మారావు : మన దేశంలో కేవలం నిర్గుణ బ్రహ్మోపాసన నుంచి ఉచ్ఛిష్ట గణపతి ఉపాసన వరకు అన్ని రకాలూ వున్నాయి. నరబలి మొదలు ఆత్మ బలిదానం వరకూ అన్ని లెవెల్సూ ఉన్నాయి. కీడు తియ్యడం, సంతానం కోసం కోవెలలో మూడు రాత్రులు నిద్ర చెయ్యడం లాటి ఆచారాలూ వున్నాయి. ఇటువంటి వాటినన్నిటినీ చారిత్రక దృష్టితో చూడాలి.

మధురవాణి : ఇప్పటి మనస్తత్వంతో అప్పటి సంగతుల్ని చూసి కంగారు పడకూడదం టారు తాతాజీ.

తాపీ ధర్మారావు : అన్నిటిలో పాత సూత్రాలూ కొత్త జీవనము డీకొంటూ వుంటాయి. సూత్రాలను జీవితంతో మేళవించడం మంచిపని.

మధురవాణి : ఆ సమన్వయమే వుంటే అన్నీ చక్కబడతాయి అంటారు. అన్నట్లు చేయి తొడకింద పెట్టి ప్రమాణం చేయడం ఏవిటి?

తాపీ ధర్మారావు : అదా - అంటే గోప్యాంగం దేవతా విగ్రహాన్ని ముట్టుకొని చెబుతున్నాను అని ప్రమాణం.

మధురవాణి : తల్లితోడు అక్క తోడు అంటారు. అదీ యింతేనా?

తాపీ ధర్మారావు : ఆ. అదే - గోప్యాంగ సంపర్కమే కనిపిస్తోంది. ఎదటి వారిని కట్టడి చెయ్యాలంటే మన ఆడవాళ్ళు నన్ను చంపుకుతిన్నట్లే అని ఒట్టువేస్తూ వుంటారు.

మధురవాణి : మన కోర్టుల్లో యింకా దేవుడి మీద అని ప్రమాణాలు చేయిస్తూ వుంటారు. ఇది అవసరమా?

తాపీ ధర్మారావు : కూట సాక్ష్యం చెప్పిన వ్యక్తి కూడా ఆ ప్రమాణమే చేస్తాడు. అంటే ప్రమాణం మీద గౌరవ భావం అంతరించినట్లే కదా. దేవుడ్ని కోర్టులోకి రప్పించడం ఎందుకు? ఆ ఆచారం యిప్పుడు నిరుపయోగం అయిపో యింది.

మధురవాణి : ఈ వెంకటేశ్వర స్వామికి జుట్టు యివ్వడం అసలు ఎలా వచ్చింది?

తాపీ ధర్మారావు : పండగ నాడూ పాత మొగుడేనా అని ఒక ఆవిడ రవికల పండుగలో విచారించిందట. పూర్వం వ్యభిచారం రెచ్చిపోయి సాగేదట. వ్యభిచారం యిష్టంలేని వాళ్ళు తలవెంట్రుకలను సమర్పిస్తే చాలునని ఓ చక్రవర్తి రూలు ప్యాస్ చేశాడు. అవమాన మనండి. శిక్ష అనండి. వెంట్రుకలను యివ్వడం ఆచారమయింది. రాను రాను వ్యభిచారం పోయి జుత్తు యివ్వడంతో తీరింది ఆరాధన.

మధురవాణి : ఒకప్పుడు 'స్త్రీ'కి ఒక భర్త అన్న రూలులేదని తెలుస్తోంది. ఇప్పటి దృష్టి వేరు. అప్పటి వ్యవహారాలు వేరు. ఇదే రైటు అది తప్పని ఎలా చెప్పగలం?

తాపీ ధర్మారావు : పండితులు జాగ్రత్తగా వుండాలి. తొందర పడకూడదు.

మధురవాణి : తమకు చుట్ట ఎలా అలవాటయిందీ తెలుసుకోవచ్చా?

తాపీ ధర్మారావు : పర్లాఖిమిడిలోనే నాకీ చుట్ట కాల్చడం అలవాటయింది. ఒక బొబ్బిలి విద్యార్థి కాన్‌స్టిపేషన్‌కు మందుగా చుట్ట కాల్చడం నేర్పాడు. మిత్రుడు చెప్పిన మాటలన్నీ శిలాక్షరాలు. చుట్ట నాకు తారక మంత్రం అయింది.

మధురవాణి : మీ తెలుగు సర్దాకి కారణం ఏమిటి?

తాపీ ధర్మారావు : సుసర్ల సత్యనారాయణ అని ఓ బొబ్బిలి విద్యార్థి నా దగ్గరకు వచ్చి చక్కని పద్యాలు. బాగా చదువుతూ వుండేవాడు. ప్రబంధాలలోంచి పద్యా లేరి వెంకటగిరి సంస్థానం వారు ఒక పుస్తకం వేశారు. నేను కోరగా ఖర్చులన్నీ వారే పెట్టుకుని దాదాపు ఇరవై పుస్తకాలు పంపించారు. అలా ఏర్పడింది నా ప్రబంధ పరిచయం, విద్యా తృష్ణ.

మధురవాణి : గిడుగు రామ్మూర్తి పంతులుగారి గురించి చెప్పండి. మీ రాయన అభిమాన విద్యార్థి కూడా నటగా -

తాపీ ధర్మారావు : మా మేష్టరు గారి హృదయం వజ్రాయుధంకంటె కఠోరంగా వుండగలదు. పూవు కంటె మృదువుగానూ వుండగలదు. పర్లాఖిమిడిని తమ మాతృభూమిగా గణించారు. ఆ ప్రాంతీయుల అభ్యుదయానికి చాలా శ్రమ తీసుకున్నారు. సవరజాతి వారిని ఆత్మీయులుగా భావించి వారికి లిపి సౌభాగ్యాన్ని కల్పించారు. ఇంత అభిమానంతో చూచిన ఆ ప్రదేశాన్ని ఘోరమైన ప్రతిజ్ఞ పట్టి త్యజించగలిగారు. మళ్ళీ పర్లాఖిమిడి ముఖం చూడనని శపథం పట్టారు, చూడకుండానే దివంగతులయ్యారు. మంచి కయినా చెడ్డకయినా పట్టినదే పట్టు. హరిహర బ్రహ్మాదులైనా ఆ పట్టు సడలించలేరు.

మధురవాణి : ధన్యులు. ఆయనతోబాటు మీరూనూ. వారి కోర్కె వ్యావహారిక భాషను పత్రికలలో ప్రవేశపెట్టి ఆయనకు గొప్ప తృప్తినిచ్చారు. ప్రజల భాష ద్వారా సినిమా రంగాన్ని జనం మధ్యకు తీసుకువచ్చారు. నార్ల మీ లైన్లో ముందుకు వెళ్ళి సంపాదకీయం వ్యాసాలకు శీర్షికలకు వన్నె తెచ్చారు.

తాపీ ధర్మారావు : ఇంతకీ ఏమంటావు? (నవ్వు)

మధురవాణి : ఏమంటాను? నవ్యాంధ్ర జాతినిర్మాతలు మీరంటాను (నవ్వు) - ★

(వచ్చే సంచికలో సి.ఆర్. రెడ్డి గారితో మధురవాణి)

# Rape Victims, U.S.A

According to a survey funded by the Federal Government and published by the National Victim Center last week, 683,000 adult women were forcibly raped in the U.S. in 1990. That figure is five times the number of sexual assaults reported by the U.S. Justice Department for the same year.

**Relation Group**

Stranger 22%
Husband/Ex-husband 9%
Father/Stepfather 11%
Boyfriend/Ex-boyfrined 10%
Other relative 16%
Other acquaintance 29%

**Age Group**

Older than 29 6.1%
25 to 29 7.1%
Younger than 18 29.3%
11 to 24 22.2%
11 to 17 32.3%

# అసతో మా సద్గమయ

రాంభట్ల

ఏది సత్యం ఏదసత్యం ఓమహాత్మా ఓమహర్షీ! అన్నాడు శ్రీశ్రీ. ఆయన ప్రశ్నించిన మహాత్ముడెవరో తెలీదు. అడిగిన మహర్షియెవరో అంతకన్నా తెలీదు. ఆ మహాత్ములు మహర్షులు మతప్రవక్తలు అయివుంటే నాటి శ్రీశ్రీ మూడ్ ఎలాంటిదో అసలే తెలీదు. మతానికిమూలం పురాణాలు పురాణాలనుంచి పుట్టిన విశ్వాసం. సదసద్వివికిత్స తాత్విక సమస్య. తత్వాలు జ్ఞాన సాధనాలు. జ్ఞానానికీ విశ్వాసానికీ చుక్కెదురు. తత్వశాస్త్రాల చరిత్ర చూస్తే అవి పురాణాలకు మతాలకు విరోధంనుంచే పుట్టాయన్న సత్యం గోచరిస్తుంది.

మతం తత్వశాస్త్రం పుట్టినవి పుట్టినట్టుగానే లేవు. అవి నిత్యం సంఘర్షిస్తూనే వస్తున్నాయి. ఈ సంఘర్షణ వల్ల అటు తాత్విక భావాలు ఇటు మత భావాలు కూడా మారుతు వస్తున్నాయి. ఇవి ఇలా వుండగా విజ్ఞాన శాస్త్రాలు పుట్టి పెరుగుతున్నాయి. విజ్ఞాన శాస్త్రాలు నిరూపిస్తున్నది ప్రత్యక్ష సత్యం. విశ్వాసానికి ప్రత్యక్షం విరోధి. అందువల్ల మతం తన ఆయుధాన్ని విజ్ఞాన శాస్త్రం మీదికి మళ్లించింది. తత్వశాస్త్రాలు విజ్ఞాన శాస్త్రాలతో జట్టు కట్టాయి. ఆదశలో మతం తత్వశస్త్రాల సాయాన్ని పొందడానికి యత్నిస్తూంది. తాత్విక చర్చల్లో కనిపించే డయలెక్టిక్స్‌కు కొత్త వ్యాఖ్యానాలు చేయడం మొదలు పెడుతుంది. సత్ అంటే సత్యం దానికి విరుద్ధపదం అసత్. అసత్యం. సత్యాన్ని బౌద్ధులు నిత్యం అన్నారు. ఈ బౌద్ధ పదం పాళీ భాష ద్వారా వచ్చి మనకు 'నిజం' అయింది. నిత్యానికి వ్యతిరేక పదం అనిత్యం. కాని తెలగు నిజానికి వ్యతిరేక పదం ''అబద్ధం'' - ఇంగ్లీషు ట్రూత్‌కి ఏంటానిం ఫాల్స్ అయినట్లు. అబద్ధం అంటే బద్ధంకానిది, దేనికీ కట్టు పడనిది అని అర్థం. ఇది తర్కం హేతువాదం పెరిగిన తరవాత పుట్టిన మాట అయివుంటుంది. అలాగే నిజం అన్న మాటకు సంస్కృతంలో వేరే అర్థంవుంది.

భారతదేశాన తత్వశాస్త్రాలు ఉపనిషత్కాలంలో పుట్టాయి. తత్వశాస్త్రాలతో పాటే డయలెక్టిక్స్ కూడా పుట్టాయి. భారతీయ డయలెక్టిక్స్‌కు గుండెకాయ నెగెటివు వ్యతిరేక పదం. అందువల్లనే ''అసతో మా సద్గమయ-తమసో మా జ్యోతిర్గమయ-మృత్యోర్మా అమృతంగమయ'' అన్నసూక్తి పుట్టింది. అసత్యంనుంచి సత్యానకి కొని పొమ్మని నిత్యం కోరుకుంటూ వుంటారు జ్ఞానులు.

డయలెక్టిక్స్ ననుసరించి సత్యం దిగంతరేఖ లాంటిది. దాన్ని అందుకొనడంకోసం ఎంత పురోగమించినా దృక్కుకూదృశ్యానికీ అంతే దూరం వుంటుంది. అందువల్ల సత్యాన్వేషణ నిరంతరం సాగుతూనే వుంటుంది. ప్రతి సత్యమూ సాపేక్షమేకాని పరమసత్యంవుండదు. ఇది జ్ఞాన పద్ధతి. తాత్త్విక పద్ధతి. విశ్వాసం ఇందుకు భిన్నం. అది మతపద్ధతి. ఆ మతాలు చెప్పిందే పరమ సత్యం. నేటిమతాలన్నీ '' పరమ సత్యాలు''; మతప్రవక్తలు చరమగురువులు.

చరమగురువు పరమ సత్యం. ఇది మతసిద్ధాంతం. దీని సమర్థన కోసం సత్యాన్ని వ్యావహారిక సత్యం అనీ పరమసత్యం అని విభజించారు మతవాదులు. ఈ వాదాన్ని

సమర్థించుకొనడానికి తత్వశాస్త్రాలనూ విజ్ఞాన శాస్త్రాలనూ తోడు తెచ్చుకుంటూవుంటారు. ఎదిగీ ఎదగని శాస్త్రాలు అందుకు తోడ్పతూవుంటాయి కూడా. రుగ్వేదం పదోమండలంలోని ఒక సూక్తం ఇందుకు చక్కని ఉదాహరణ. ఆసూక్తమిది.

''నాసదాసీన్నోసదాసీత్తదానీం నాసీద్రజోనోవ్యోమాపరోయత్''

ఇందులో మొతటి వాక్యమే ఆసూక్తానికి పేరుగా పెట్టారు. ఇది పూర్వమర్యాద. ''అప్పుడు సత్తులేదు. అసత్తులేదు. అలాగే భూమి లేదు. ఆకాశంలేదు'' అని ఆసూక్తానికి అర్థం. సత్తు అసత్తు తాత్విక పరిభాష. భూమ్యాకాశాలు ఆనాటికి లేవన్నది మతభావన. ఈ మత భావన అచ్చం ఇలాగే అసురవేదంలో కూడా కనిపిస్తుంది. అసలది ఏడువేల ఏళ్లనాటి సుమేరు కావ్యం. క్రీస్తు పూర్వం మూడో సహస్రాబ్ది చివరన దాన్ని అసుర బాషలోకి అనువదించారు. దానికి బాబిలోనియన్ జెనిసిస్ అని పేరుపెట్టారు పండితులు. దాని తొలి వాక్యమే పుస్తకం పేరు అయింది చూడండి.

ఎనూమాఎలిష్ లానబూ షమూము.

షప్లిష్ అమ్మతుం షుమా లాజక్రా.

అప్పుడు పైన అంతరిక్షానకి పేరు లేదు. కింద భూమికింకా పేరు పెట్టలేదు. ఇదీ ఆ అసుర వేద వాక్యానికి అర్థం. అసురభాషలో ఈ గ్రంథంపుట్టిన వెయ్యేళ్లకు బైబిలు పాత నిబంధన రచన ఆరంభం అయిందంటున్నారు పండితులు. ఆనాటి ప్రపంచ పటాన్ని గిడియన్ బైబిలు డూట్రోనమీ చివరన చూడవచ్చును.

బల్ల పరుపుగా భూమి పైన గుబ్బ గొడుగులా ఆకాశం. సూర్యచంద్ర గ్రహతారకాదులు భూప్రదక్షిణంచేస్తూవుంటాయి. ఈ భావన ఎంత కాలం వరకు సత్యంగా చలామణి అయింది? ఇప్పటికి పదహారు వందల ఏళ్ల కిందట అంటే నాలుగో శతాబ్దంలో ''సౌరకేంద్రక'' సిద్ధాంతాన్ని ప్రతిపాదించినందుకు ఆర్యభటుని దేశబహిష్కృతుని చేశారు. అది సత్యం అని తెలిసినా బహుజనాభిప్రాయానికి జడిసి వరాహమిహిర బ్రహ్మగుప్తులు క్షీరసాగర మథన పురాణం మరుగున దాగొన వలసి వచ్చింది. పశ్చిమాన కోపర్నికస్ గెలీలియోలు శిక్షలను భవించవలసి వచ్చింది. ఇప్పటి మన పెద్దలు శాస్త్రీయ సత్యాలను కాదని రుజువు చేయ లేక అవి లౌకిక సత్యాలు 'పారమార్థిక' సత్యం వేరు అని సత్యానికి విశేషణాలు తగిలించి తప్పించుకుంటున్నారు.

సత్యాన్ని తాత్వికంగా విశ్లేషించడానకి ముందు ఆశాస్త్రాల స్వరూపస్వభావలను గురించి తెలుసుకొనవలసి వుంటుంది. ప్రతి సమగ్ర తత్వశాస్త్రంలోనూ రెండు భాగాలుంటాయి. ఒక దాన్ని శారీరక మీమాంస (ఆంటోలజీ) అంటారు. రెండోదాన్ని జ్ఞాన మీమాంస (ఎపిస్టమోలజీ) అంటారు. సత్యం అన్నది జ్ఞానమీమాంసా భాగానికి సంబంధించిన సమస్య. శారీరక మీమాంస భౌతిక విశ్వ అస్తిత్వాన్ని (బీయింగ్) చర్చిస్తుంది. జ్ఞాన మీమాంస మనషి చైతన్యాన్ని (కాన్షస్‌నెస్) చర్చిస్తుంది.

మనషి పుట్టిన నాటి నుంచీ యివి రెండూ వున్నాయి. ఈ రెండింటికీ గల సంబంధం ఏమిటి అన్న ప్రశ్న నుంచి తత్వశాస్త్రాలు పుట్టాయి. ఈ ప్రశ్ననే తత్వ శాస్త్రమౌలిక

ప్రశ్న (బేసిక్ క్వశ్చన్ ఆఫ్ ఫిలాసఫీ) అంటారు పండితులు. రెండూ వున్నమాట నిజమే కాని అందులో అగ్రిమం యేది అనగ్రిమం యేది. నేయి యేది? అనుయాయియేది? ఏది ప్రెయిమరీ ఏది సెకండరీ? అస్తిత్వం అగ్రిమం అన్నవి భౌతిక వాదాలవుతాయి. చైతన్యం కాన్షన్‌నెస్ అగ్రిమం అన్నవి భావవాదాలు అవుతాయి. రెండూ సమానమే అన్నవి ద్వయిత వాదాలు అవుతాయి. ద్వయితాన్నే ఇంగ్లీషులో డ్యూయెలిజం అంటారు. మతాలకు తత్వ శాస్త్రాలకు చుక్కెదురు అయినా మత సిద్ధాంతాలను తాత్వికంగా విశ్లేషించిచూస్తే ప్రతి మతమూ ద్వయితమే అవుతుంది. మిగతా తత్వాలు ఏకతలు, మోనిజాలు.

భావవాదాన్ని వస్తునిష్ఠం (ఆబ్జెక్టివు) ఆత్మనిష్ఠం (సబ్జెక్టివు) అని రెండుగా వర్గీ కరించారు శాస్త్ర వేత్తలు. భౌతిక వాదంలో ఈ వర్గీకరణ ఇపుడు కానరాదు. కాని ఆది (శైశవ) దశలో వున్నప్పుడు వుండేదనడానికి ఆస్కారంవుంది. హైలోజోయిజం, హెడోనిజాలను ఇలావర్గీక రించ వచ్చునని కొందరంటారు. ఆత్మనిష్ఠాన్ని శాక్త తాత్వికులు ''అహంత'' అన్నారు. వస్తునిష్ఠాన్ని 'పరాహంత' అన్నారు. ఈ మాటల్లో 'డయలెక్టిక్సు' బీజరూపంలోకనిపిస్తాయి. ఈ కొలమానంతో చూస్తే ప్లేటో హెగెల్ యిద్దరూ పరాహంత భావవాదులు. శంకరుడు అహంతభావవాది.

పరాహంతభావవాదులు కొసకు దేవుని దగ్గరకు చేరుతారని పశ్చిమ పండితులంటారు. ఆ తత్వవేత్తలు అలా చేరారోలేదో తెలీదు కాని మతవాదులు దైవసమర్థన కోసం ఆ తత్వాలను వాడుకుంటున్నారన్న మాట నిజం. మన దేశాన జైనబౌద్ధాలు అహంత భావవాదాలే. ఐనా బౌద్ధులు దైవవాదాన్ని ఖండించడం కోసం తమ తత్వాన్ని విస్తారంగా వాడారు. తర్కశాస్త్ర వ్యాఖ్యాత అయిన ఉదయనుడు దేవుడిని వ్యాజనింద చేస్తూ ఇలా అంటాడు ''ఐశ్వర్య మదమత్తోసి మామనజ్ఞాయ వర్తసే-ఉపస్థి తేషు బౌద్ధేషు మదధీనా తవస్థితిః'' ఐశ్వర్యంతో మద మెక్కి నన్ను లెక్క చేయడం లేదు కాని బౌద్ధులు ఎదురైనప్పుడు మాత్రం నీ బతుకు నా చేతులో వుంది'' అని మాత్రం మరిచిపోకని హెచ్చరిస్తాడు.

అహంతభావవాదులు కొసకు సోలిప్సిస్టులవుతారని కొందరంటారు. సోలిప్సిజం అంటే నేనున్నాను కనక జగత్తు వుంది. నేను లేక పోతే జగత్తే లేదన్న తత్వం. ఇది పశ్చిమాన వుంది కాని మన దేశాన లేదు. భౌతిక వాదాభిమానులు భావవాద తత్వాలను తుండూ తుపాకితోసహా (లాక్ స్టాక్ అండ్ బేరల్) తిరస్కరిస్తూవుంటారు. చదివిన తరవాత అలా తిరస్కరస్తే తప్పు లేదు. భావవాద తాత్వికుల మానవ మనస్తత్వాన్నీ (సైకాలజీ) రససిద్ధాం తాన్ని (ఎస్తటిక్సు) అత్యున్నత స్థాయికి పెంచారు. ఆసత్యాన్ని భౌతిక వాదాభిమానులు గ్రహించడం లేదు. భావవాదులు వీటినే కాదు డయలెక్టిక్సును కూడా పెంపొందిస్తూ వచ్చారు. ద్వంద్వాలు వాటి సంఘర్షణను అనేక కోణాల నుంచి చర్చిస్తూవచ్చారు.

ఏకతను ద్వంద్వాలుగా విడగొట్టి ఆ ద్వంద్వాల సంఘర్షణ ద్వారా, ఆ ఏకతను అర్థంచేసుకొనడమే డయలెక్టిక్సు సారాంశం అంటారు పెద్దలు.ద్వంద్వాలలో అన్వంశం (పాజిటివు) ప్రత్యంశం (నెగిటివు) రెండూ వుంటాయి. అన్వంశం సామాన్యులకు కూడ అర్థం అవుతుంది. ప్రత్యంశావగాహన అంత సులభం కాదు. అందుకని తాత్వికులు ప్రత్యంశా నికి ప్రాధాన్యం ఇస్తారు. ప్రత్యక్షం అంటే ఇంద్రియాల ద్వారా వచ్చిన జ్ఞానం. పరోక్షం అంటే అనుమానం లేదా తార్కిక జ్ఞానం. జ్ఞాన మీమాంస లోని ఈ రెండు దశలూ సామాన్యులకు

కూడా తెలుసును. శంకరుడు ప్రతిపాదించిన తత్వానికి ''అపరోక్షజ్ఞానం'' అని పేరు పెట్టాడు. ఆ మరో నెగేటివుద్వారా తన తత్వాన్ని ప్రతిష్ఠించాడు. ద్వంద్వాలను మధించిన శంకరుడు తన తత్వానికి పేరు పెట్టడంలో కూడా ఇదే పద్ధతిని అనుసరించాడు.

ద్వంద్వాలున్న మాట నిజం. కాని వాటిలో ఒక్కదాన్నే స్వీకరించి రెండోదాన్ని లేకుండా చేయడం అసాధ్యం. ప్రతి ఏకతలోనూ ఆ ద్వంద్వాలున్నాయి. కనక తన ఏకతా సిద్ధాంతానికి అంటే మోనిజానికి అద్వయితం అన పేరు పెట్టుకున్నాడు. ఈ అద్వయిత పదాన్నే మనం డయలెక్టిక్సుకు వాడుకొనవచ్చును. డయలెక్టిక్సును మన భాషలో అంతకన్న మిన్నగా చెప్పడం సాధ్యంకాదు. అయినప్పుడు శంకరాద్వయితం డయలెక్టికల్ ఐడియలిజం అవుతుంది. డయలెక్టికల్ మెటీరియలిజాన్ని భౌతికాద్వయితం అని పిలవడం సమంజసంగా వుంటుంది.

ఇదే అద్వయిత విధానంలో చెప్పిన ఉనిషత్ సూక్తి ''అసతో మా సద్గమయ'' అన్నది. ఆ సూక్తిలో తొలుత వాడినది నెగేటివుపదం. దాన్ని బట్టి చరమ సత్యం పరమ సత్యం అన్న దేదీవుండదనీ సత్యాలన్నీ సాపేక్షలు మాత్రమేననీ విదితం అవుతుంది. అంచాత -

అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ. ★

# రస వివేచన

- చీమకుర్తి శేషగిరిరావు

## నాట్య శాస్త్రరచన:

నాట్యశాస్త్రము ఎవరి వలన ఎపుడు రచితమైనది-అను విషయముపై 19వ శతాబ్ది చివరనుండి ఇప్పటి వరకు ఎంతయో చర్చ జరిగినది. ఆ వివరములకు ఇచట తావులేదు. ఆ చర్చా ఫలితమును ఒక పండితుడు - డా. పోణంగి శ్రీరామ అప్పారావు-తన గుప్త భావ ప్రకాశికా సహితమగు నాట్యశాస్త్రమున ఇటుల తెలియజేసెను.

నాట్య సంప్రదాయవేత్తయును, భరతుల(నటుల)యెడ ఆదరము కలవాడును ఆయిన ఎవరో ఒకరు ఆయా కాలములందు రచించబడిన భాగములన్నిటిని ఏకత్ర కూర్చి, మధ్యగల లోపములను తాను పూరించి, నటజాతికి గౌరవము నొసంగుటకై కర్తృత్వమును పురాణ పురుషున కాపాదించి గ్రంథమును ప్రచారములోనికి తెచ్చియుండును. కాలక్రమమున నాట్య శాస్త్రకర్తగ భరతుని పేర స్థిరపడి పోవుటయే కాక భరతడు పురాణ పురుషుడను విశ్వాసము ప్రబలి యుండును. కాళిదాసాదులు ఆ విశ్వాసముపై ఆమోదముద్రవైచినారు-అనునది విమర్శకుల అభిప్రాయసారమని చెప్పవచ్చును.

ఇందువలన 'భరతుడు' అను నాట్యశాస్త్రవేత్తయే లేడనియు అతడు ఒక కల్పిత పురుషుడనియు స్పష్టము. పలువురు సాగించిన ఒక సమిష్టి కృషికి ప్రతీకగ ఆ రూపకల్పన జరిగియుండును. అయిన యెడల ఆ కల్పిత పురుషునికి 'భరత' అను పేరు ఎందవలన పెట్టబడినది. అది ఒక పురాణ పురుషుని పేరని కొందరనెరదు. కాని నటుడుగ పేరొందిన భరతుడు ఎవ్వడును పురాణపురుషులలో కానరాడు. వేదములలోని భరతులుగాని, ఋష భుని కుమారుడగు భరతుడుగాని, దుష్యంతుని కుమారుడగు భరతుడుగాని నటులుగారు, గాయకులు గారు. అట్టి సందర్భమున నాట్యశాస్త్ర కర్త పేరు 'భరత' అని ఎందులకు కల్పింపబడవలెను. ఈ విషయమును చర్చించిన కొందరు పండితులు భావ, రాగ, తాళ-అను పదాలలోని మొదటి అక్షరాలను కలుపుట వలన 'భరత' అను పేరు ఏర్పడినదనిరి. ఆ వివరణ సరియని చెప్పుటకు వీలులేకున్నది. భావ, రాగ, తాళాలు ఒక పాటకైనను ఉండును; నాట్యమున ముఖ్యమైనది అభినయము. దాని ప్రసక్తియే లేని పదము నాట్యశాస్త్రకర్తకు పేరుగ ఎటుల ఉండగలదు. ఇక 'భరత' అను పదానికి 'నటుడు' అను అర్థము కలదని కొందరనె దరు. సంస్కృతమున ఆ పదమునకు అట్టి అర్థమును ఏ ధాతువునుండియు సాధింపలేము.

ఇక ఈ 'భరత' పదము ఏదియో ఒక పూర్వవాఙ్మయము నుండియే సంస్కృతములోనికి ఒక ప్రత్యేకార్థముతో చొరబారి యుండును. అట్టి పూర్వ వాఙ్మయము భారతదేశమునకు సంబంధించినంతవరకు - ప్రాకృత వాఙ్మయము మాత్రమే కాగలదు. ప్రాకృతముల కోవకు చెందిన పాలీభాషలో 'బావారత్త' అన్న పదము కలదు. బౌద్ధమతమునకు చెందని దేశీయులను - ముఖ్యముగ బ్రాహ్మణులను - ఆ పేరున వ్యవహరించెడివారు. అట్టి ఒక పదము 'భరత'గ మార్పొందెనని భావించుటయే సముచితముగ కన్పడుచున్నది. బ్రాహ్మణ

మతానుయాయుల అభిప్రాయములకు సరి కుదురునటుల రూపొందింపబడినది ఈ నాట్య శాస్త్రము అని స్పష్టము చేయుటకే దాని కర్తగ కల్పితుడైన వానికి 'భరత' అనుపేరు వాడబడినది. 'బ్రాహ్మణులది' అని చెప్పుటకు ఒక ప్రత్యేక కారణము కలదు. బౌద్ధమత శాఖలలో ఒకటి యగు మహాయానమునకు చెందిన పండితులు సంస్కృతమును ఆదరించి, దానిద్వారా నాట్యమును పోషించుచు, 'శారిపుత్ర ప్రకరణమ్' మొదలగు నాటకములను రచించిరి. ఆ సంప్రదాయముకన్న తమది వేరని చెప్పటమే ఈ నాట్యశాస్త్రమునకు 'భరత' అను పేరున జోడించుట జరిగినది.

ప్రాకృతమున అదివరకే ఉండిన నాట్యశాస్త్ర వాఙ్మయమునకు భరతనాట్యశాస్త్రము ఎంతగనో ఋణపడినదనుట అందలి అనేకపదములవలన రుజువగుచున్నది. ఆ పదములను అన్నింటిని ఇచట చర్చింపజాలము. మచ్చునకు రెండు, మూడు పదములను గ్రహింపవచ్చును.

నాట్యమండపముల రూపరీతుల వివరణలో భరతుడు 'మత్తవారణి' అను పదమును వాడెను. నిఘంటువులను అనుసరించి సంస్కృతమున ఈ పదమునకు 'మదించిన ఏనుగు' అని అర్థము. ఇది రంగపీఠమునకు ప్రక్కన నిర్మింపబడునది అని ఆ శాస్త్రమున కలదు. 'మదించిన ఏనుగును నిర్మింపవలెను' అని భరతుడు చెప్పినదానికి భావమును, వ్యాఖ్యాతలలో ప్రాచీనులు వివరింపక వదలివేసిరి. నవ్యులు ఏవియోకొన్ని వింత భావములను తెలియజేసిరి. మొత్తముమీద ఈ పదము వ్యాఖ్యాతలను అందరిని తికమిక పెట్టినది. పాలీ భాషయందలి 'మత్తవరణ' అను పదము భ్రంశమొంది 'మత్తవారణి'గ సంస్కృత నాట్యశాస్త్రమున చేరుటవలన ఈ గజిబిజి ఏర్పడినది. 'మత్త' అనగ పాళీలో చిన్న; వరణ అనగా గోడ. కావున మత్తవరణ అనగ చిన్నగోడ లేదా పిట్టగోడ. రంగపీఠమునకు ప్రక్కన ఇట్టి పిట్టగోడ 'మత్తవరణ' నిర్మింపబడెడిది. కాని భరతుడు దానిని 'మత్తవారణి'గ రూపభ్రంశము చేసెను.

ఇక 'శృంగారము' అనుపదము సైతము సంస్కృత భాషకు చెందినది కాదు. ఈ పదము తొలుతగ రామాయణ, మహాభారతములందును, అశ్వఘోషుని రచనలందును కానవచ్చును. భరతుడు వారినుండి దానిని గ్రహించెను. పాలీయందలి 'సింగార' అను పదమే సంస్కృతమున రూపపు మార్పుతో 'శృంగారము'గ వచ్చి చేరినది. సంస్కృత ధాతువులను అనుసరించి 'శృంగార' పదమునకు అర్థమును సాధించుటకు పండితులు ఎందరో కృషిచేసి విఫలయత్నులైరి. తెలియవచ్చినంతవరకు సంస్కృతమున తొలి నిఘంటువగు నామ లింగానుశాసనమున శృంగారము, దీప్తి, ఉజ్జ్వల - అనునవి ఒకే అర్థముకల పదములుగ చెప్పబడెను. కాని దీప్తి, ఉజ్జ్వల అనునవి శృంగారమునకు సంస్కృతమున పర్యాయపదము లుగ ఎవరును వాడలేదు. పాలీయందలి 'సింగార'కు దీప్తి, ఉజ్జ్వల అనునవి పర్యాయపదాలే. ఆ భాషలో 'సింగార' అనగా 'సమలంకృత సౌందర్య శోభ' లేదా 'చక్కని వేషము', 'సింగి' అనగా బంగారము అను అర్థము పాలీలో కలదు. ఆ పదమునుండియే 'సింగార' పదము రూపొందెను. అదియే సంస్కృతమున 'శృంగార'ముగ మారినది.

ఇక ఔడవ, ఈహామృష, డిమి మొదలగు పెక్కు పదములును సంస్కృత నాట్యశాస్త్రము లోనికి ప్రాకృత వాఙ్మయమునుండియే చొరబారియుండును.

ఈ నాట్యశాస్త్రము గుప్తరాజుల కాలమున క్రీ.శ. 350 ప్రాంతమున రచితమైనటుల భావించుటకు చాల ఆధారములు కలవు. సంగీతమునందలి యేడు స్వరములను యేడు జాతులని రామాయణము వ్యవహరించినది. వేద స్వరములకే, 'స్వరము' అనునది వాడుకలో అప్పటికి ఉండియుండును. కావున వానినుండి ఇవి వేరని తెలుపుటకై 'జాతి' అనుపేరు అపుడు కల్పితమై యుండును. భరతుడు అటులగాక 'స్వరములు' అనియేవాడి, జాతి అనుదానిని 'రాగము'నకు పర్యాయపదముగా వాడెను. కావున రామాయణ రచనకు తరువాత చాలకాలమునకు 'నాట్యశాస్త్రము' రచింపబడియుండును. పుష్యమిత్రుని కాలము క్రీ.పూ. రెండవ శతాబ్ది అంతమున రామాయణము రచితము. ఆ తరువాత కొన్ని శతాబ్దముల అనంతరమున నాట్యశాస్త్రము రచితమగుటకు అనుకూల పరిస్థితులు గుప్త యుగమున మాత్రమే ఏర్పడినవి. సముద్రగుప్తుని కాలమున (క్రీ.శ. 350 ప్రాంతమున) పౌరాణిక హిందూమతమునకు ఎంతయో ఆదరము లభించినది; శాస్త్ర పురాణములు ఎన్నియో ఆ కాలమున రూపొందినవి. అట్టివానిలో ఒకటియే ఈ నాట్యశాస్త్రము.

ఇంకొక తీరుగకూడ ఇది గుప్తకాలమునకు చెందినదిగ భావించుటకు అవకాశము కలదు. రామాయణమున రస ప్రస్తావన వచ్చినపుడు 'శృంగార, కరుణ, హాస్య, రౌద్ర, భయానక, వీర మొదలగు రసములు' అని చెప్పబడినది. అందువలన అప్పటికి రససంఖ్య యెనిమిది అని నిర్ధారణ కాలేదనుట స్పష్టము. నిర్ధారణయే అయినచో బీభత్స, అద్భుతములను నిర్దిష్టముగ చేర్చియేయుందురు. ఆ తరువాత గుప్త యుగమునాటికే రసములు ఎనిమిది మాత్రమే, అను నిర్ణయము జరిగినది. బౌద్ధ నాటకములందు కననగు శాంతరసమును భరతుడు జారవిడిచెను.

ఇందులకు ఒక కారణము కలదు. గుప్త యుగమున వర్ధిల్లినవి పౌరాణిక హిందూ మతమునకు చెందిన భక్తి సంప్రదాయములు, బౌద్ధ మతము బోధించు నిర్వాణమును ఇవి ఆదరించినవి కావు. శాంతము నిర్వాణ లక్షణముగ భావించి ఆనాటి వైదిక పండితులు దానిని వదలివేసిరి.

ప్రాకృత వాఙ్మయమును కొల్లగొని గుప్తకాలపు పండితులు ఈ నాట్యశాస్త్రమును రూపొందించిరనుటవలన వారి కృషిని నిందార్హముగ భావించినటుల తలపగూడదు. ఒక విస్మృత వాఙ్మయమునకు క్రొంగ్రొత్త రూపమిచ్చి వారు లోకమునకు చాల మేలును సమకూర్చిరి. అందులకు ఉదాహరణములుగ చెప్పదగినవి ఆ గ్రంథమున చర్చింపబడిన 'ధర్మలు'. ఇవియే లోకధర్మి, నాట్యధర్మి. వాస్తవిక జగత్తునకు కళకుగల సంబంధము ఇందు చర్చితమని చెప్పవచ్చును. వాస్తవిక జగత్తును తనయందు ప్రతిఫలింప జేసికొని లోకమునకు దానిని 'కళ'గ కళాకారుడు అందించును. అటుల అందించుట యథాతథముగ ఉండునెడల అది చర్విత చర్వణమై పేలవముగ ఉండును. వాస్తవికతలో లేని దానిని కొంతకలిపి రమ్యతను చేకూర్చి అందించునెడల అది ఇంపుగ ఉండగలదు. అనగా కళలో కొంత 'కల్ల' ఉండుట తప్పనిసరి. అటులని వాస్తవికతకు అతిదూరముగ కళాకారుడు పోలేదు. లోకధర్మి, నాట్యధర్మల మధ్య చక్కని మేళనమును సాధించినవాడే కళాచతురుడు! ఇట్టి దానిని తొలుత వివరించినది ఈ నాట్యశాస్త్రమే. ఇట్టివే కళకు సంబంధించిన పెక్కు విషయాలు తొలుతగ అందు కానవచ్చును.

ఈ నాట్యశాస్త్రమును చక్కగ పరిశీలించినపుడు ఇది గుప్తకాలమున ఒక ప్రత్యేకవర్గమునకై రచితమని తెలియవచ్చును. వాత్స్యాయన కామసూత్రములలో నాగరికుడుగ వర్ణింపబడిన

వాని ప్రయోజనమే ఈ శాస్త్రమునకు లక్ష్యము. పనిలేకుండ జీవించుటకై తగు వసతులుండి, విలాసముగ కాలము గడుపుటకై తీరికయున్న ఉన్నతవర్గముల వారికే ఇది సరికుదురునది. క్రింది తరగతుల అభిరుచులకు ఇందు స్థానమున్నటుల కన్పడదు. అందువలననే అందు తెలుపబడిన నట్టువకత్తెల 'వేషధారణ' (ఆహార్యము)లో పై వర్గముల అభిరుచులే కన్పించును. యథార్థమున గుప్తకాలమున కానిండు, అంతకుముందు కానిండు, పామర జనులకు (క్రింది వర్గముల వారికి) రుచించు నాట్యములు అనేకములు ఉండెడివి. క్రీ.శ. రెండవ శతాబ్దికి చెందిన ఒక శిలాఫలకమున ఒక నాట్య భంగిమ కానవచ్చినది. అందలి నట్టువకత్తెలు, అర్థోరుకాలను (నిక్కర్లను) ధరించిరి. ఇట్టి వేషధారణకు భరతుని ఆహార్యమున తావేలేదు.

ఇంకొక లోపమును కలదు. భరతుడు నాట్యమునకు సంబంధించినంతవరకే రసభావనను వివరించెను. 'రసము' నకున్న విశ్వజనీనతను అతడు గుర్తించలేదు. 'కళ' అనునది లోకవృత్తమునకు ప్రతిబింబము. మనసు కలవానియందెల్ల రసము ఏదో ఒక రీతిలో స్ఫురించును. 'శాంతము'ను ఒక రసముగ గ్రహింపకపోవుట ఇంకొక ప్రముఖ లోపము. బౌద్ధులయెడగల విద్వేషమే ఒక కారణము కావచ్చును. కాని శాంతము బౌద్ధుల సొంత సొమ్ముకాదు. లోకవృత్తమున మానవులందరికి చెందినదది. మానవుని మనసున అష్టవిధ రసములక్కు అతీతమగు శాంతమునకు తావుకలదు.

## అనంతర పరిణతి:-

భరతుని నాట్యశాస్త్రము తదనంతరకాలపు నాట్యశాస్త్రములకు వరవడి దిద్దినది. పామర జనములలో వ్యాప్తియందున్న అనేక నాట్యభంగిమలను గ్రహించి, ఉన్నతవర్గముల వారి అభిరుచులకు అనుగుణముగ వీనిని క్రమబద్ధముగ చేసి గ్రంథస్థములు చేయుటను అవి ఒక ముఖ్యకర్తవ్యముగ భావించినవి. ఇందులకు పెక్కు ఉదాహరణలు కలవు. అందులో ప్రముఖము: క్రీ.శ. 12వ శతాబ్దికి చెందిన పశ్చిమ చాళుక్యరాజు సోమేశ్వరుడు సంగీత, నాట్యములందు అభిరుచి కలవాడు. ఆయన ఒక దినమున రాజ భవనముపైనుండి, వీధిలో ఒక భిల్లవనిత నాట్యము చేయుటను చూచెను; అది గోండ్లీ నాట్యము. దానికి ముగ్ధుడై ఆరాజు క్రిందకు దిగివచ్చి, ఆ భిల్లవనితనుండి ఆ నాట్య రీతిని నేర్చుకొని, దానికి శాస్త్రీయ రూపమును కల్పించెను. ఈ విషయమును జాయపసేనాని అను తెలుగుదేశపు నాట్యశాస్త్ర వేత్త తన గ్రంథమున తెలియజేసెను. భరతుడు నాట్యమునకు మాత్రమే వర్తింపజేసిన రస సిద్ధాంతము తరువాతకాలమున కావ్యములకును పండితులు సమన్వయింపజేసిరి. వారికి మార్గదర్శకుడు ఆనందవర్ధనుడు.

భరతుడు వదలివేసిన శాంతరసమును అష్టవిధ రసములతో చేర్చి భట్టతౌతుడు తాను రచించిన కావ్యాలంకార సారసంగ్రహమున వివరించెను. ఈ శాంతరసమును గూర్చి పెక్కువాదములు కలవు. శాంతము రసమేకాదని కొందరు భావించిరి. నాటకమున కూడదు కాని కావ్యమునకు తగునని కొందరనిరి. నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలలో ప్రముఖుడగు అభినవగుప్తుడు (క్రీ.శ. 10, 11 శతాబ్దాలు) కావ్య నాటకములు రెండింటికిని శాంతము తగుననెను. తదాదిగ సర్వేసర్వత్ర రసములు తొమ్మిది అనుట ఆమోదితము.

ఈ నవరసములను - శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంత రసములను - మనమిక వివేచింపవలసి యున్నది.

(సశేషము)

